# కుంతల

శ్రీ త్రిపురారి భట్ల
వీర రాఘవ స్వామి
సంస్కృత కళా శాలా పూర్వాధ్యక్షుడు

శ్రీ గుంటుపల్లి నారాయణ రావుకు

శు భా శీ స్సు ల తో

# అనుక్రమణిక

# కుంతల

## 1

రాజసింహాసన మధిష్ఠించి కోసలరాజగు జయంతదేవుడు రాజకార్యములు పరిశీలించుచుండెను. ఆ రాజసభలో మంత్రులు సామంతులు నాగరకులు మొదలైనవారు ఉచితాసనముల గూర్చుండి యుండిరి. ఆసమయమున ప్రతీహారి చనుదెంచి యథోచితముగ నమస్కరించి, "మహారాజా! ఋషిసమానుడగు బ్రాహ్మణోత్తము డొకడు దేవర దర్శనార్థము ద్వారము కడ వేచియున్నాడు" అని విన్నవించెను.

జయంతదేవుడు, "విజయవతీ! ఆ బ్రాహ్మణోత్తము డెవరు?" అని యడిగెను.

విజయవతి, "ఎవరో తెలియదు. కాని యతడు ప్రసన్నమూర్తి! దీర్ఘకాయుడు! తేజోదీపిత వదనుడు! చూడగా గొప్ప పండితునివలె కనబడుచున్నాడు. తనను గూర్చి దేవర సమక్షమందే నివేదించుకొందు నని పలికినాడు" అని మనవి చేసెను.

రాజు, "ఆయనను శీఘ్రముగా దోడుకొని రమ్మ" అని యాజ్ఞాపించెను.

విజయవతి వెడలిపోయి బ్రాహ్మణుని వెంటబెట్టుకొని వచ్చెను. బ్రాహ్మణుడు సింహాసనస్థుడగు రాజు నుద్దేశించి దక్షిణబాహు వెత్తి, "విజయస్వ రాజన్!" అని దీవించెను. అయన ప్రసన్న గంభీరవిగ్రహమును దీర్ఘకాయ

మును, ప్రశాంత దృష్టిని, బ్రహ్మతేజమును జూచినంతనే రాజును సభాస్తారులును సంభ్రమముతో లేచి నిలుచుండిరి. రాజు సవినయముగా శిరము వంచి నమస్కరించెను. బ్రాహ్మణుడు మరల దక్షిణహస్త మెత్తి, "విజయోఽస్తు! విజయోఽస్తు" అని యాశీర్వదించెను, సభాసదులు "నమో బ్రాహ్మణాయ" అని నమస్కరించిరి. అతడు వారలకు, "బ్రాహ్మణేభ్యో నమః" అని ప్రత్యభివాదనము చేసెను. జయంతుడు కృతాంజలియై, "బ్రాహ్మణోత్తమా! దయచేయుడు. అనుగ్రహించి యీపీఠ మలంకరింపుడు" అని విన్నవించెను. బ్రాహ్మణు డుపనిష్టు డయ్యెను.

జయంతుడు: ఆర్యా! తమ పరిచయము సెలవిచ్చి, తమ రాకకు కారణ మనుగ్రహించి యీ దాసుని కృతార్థుని జేయ వేడుచున్నాను.

బ్రాహ్మణుడు: (ఇంచుక మందహాసముతో) జయంత దేవమహారాజా! సింహాసన మధిష్ఠించిన రాజు ఎవ్వరికిని దాసుడు కాడు. అత డందరికిని ప్రభువు! అది యట్లుంచి, తమ వినయము కోసలరాజుల ఉన్నతవంశమునకు తగినట్లున్నది. తమ రాజ్యశ్రీ వర్ధిల్లుగాక!

జ: ఆర్యుల యాశీర్వాదముచే నా రాజ్యము ధన్యమైనది. ఇక పరిచయము తెలిపి తమ యభీష్ట మెరిగించినచో ఆర్యులకు ప్రీతి కలిగించి కృతార్థుడ నయ్యెదను.

బ్రా: ప్రార్థనము నెరవేరినప్పుడు గదా అర్థికి ప్రీతి కలుగుట! తమ యాదరముచే నాకు ధైర్యము కలిగినది.

కోసలాధీశ్వరులు నా ప్రార్థనము సంపూర్ణముగా నెర వేర్చెదరా ?

జ: తప్పక నెరవేర్చెదను— నా రాజధర్మమునకు నా కులధర్మమునకు అభ్యంతరము కలుగనియెడల.

బ్రా: (కనుబొమ్మలు ఇంచుక ముడిచి) అట్టి ప్రార్థనము చేయుదునని మహారాజు లెందుకు సందేహించుచున్నారు?

జ: ఆర్యా! బ్రాహ్మణులు నాకు సర్వదా పూజ్యులు. తమ యభీష్టమును శంకించుచున్నా ననుకొనవలదు. నేనంత దూరము సాహసించుటలేదు. ప్రార్థయిత యెట్టివారైనను ప్రార్థనము తెలిసికొనకయే అంగీకరించుట రాజధర్మమున కుచితము కాదు గదా!

బ్రా: మంచిది! అట్లయిన కులధర్మము నగ్గడించితి రేల! రాజు కులధర్మమును గూడ విశేషముగ విచారింప వలసియుండునా?

జ: సత్కులప్రసూతుడగు రాజు తన కులధర్మమును గూడ కాపాడుకొనినప్పుడే ప్రజల శ్రద్ధాభక్తులకు పాత్రుడు కాగలడు. అందుచేత కులధర్మమునుగూడ విచారింపవలసిన యవసర మున్నది.

బ్రా: మహారాజులు నిపుణులు, శాస్త్రజ్ఞులు! ప్రస్తా వము వచ్చినది కనుక ఒక్క విషయము విమర్శింపవలె నని ప్రార్థించుచున్నాను: రాజధర్మముతో కులధర్మమునకు గల సంబంధము ఈ బ్రాహ్మణున కెందులకు తెలిపినారో ఊహింప లేకున్నాను.

జ: ఈ ప్రశ్నకు సమాధాన మొకవిధముగా నిది వరకే చెప్పినాను.

బ్రా: ఏదియో సరిగా తెలిసికొనలేకపోయినాను.

జ: (మందహాసముతో) ఆర్యు లత్యంత తీక్ష్ణ బుద్ధులని తోచుచున్నది!

బ్రా: ఈ దీనుడు మతిమంతుడని యెవ్వరు నను కొనుటలేదు. మునీశ్వరులకుగూడ నడుమ నడుమ మతివిభ్రమము కలుగుచుండునని ప్రభువు లెరుగుదురు. అదియట్లుంచి, మరల నొక్కసారి సమాధానము వినిపించిన సంతుష్టుడ నయ్యెదను.

జ: ప్రజల భక్తిశ్రద్ధలకు పాత్రుడు కాలేని రాజు రాజధర్మము పాలింపలేడు. కులీనత లేనిరాజు ప్రజలయాదరము నకు పాత్రుడు కాలేడు. అట్టి కులీనత సత్కుల మందేయెక్కువగా సంభవించును.

బ్రా: (మెల్లగా తల యూపుచు) తెలిసిది. ఇప్పుడు చక్కగా తెలిసినది! కులీనత సురక్షితముగా నుండునంత వరకే రాజు రాజధర్మము ననుసరించి కులధర్మము కాపాడు కొనవలెనని కదా ప్రభువుల యభిప్రాయము!

జ: రాజుకూడ మానవమాత్రుడే! మానవ మాత్రుడైన వాడు తన కులధర్మము సురక్షితము చేసికొన గోరు చుండును.

బ్రా: కాని తాము సింహాసన మందుండి యీ వాక్యములు పలుకుచున్నారు. రాజు సింహాసన మెప్పు డధిష్ఠిం

చునో అప్పుడతడు సామాన్య మానవుడు కాడు. మానవ సహజ మగు ప్రవృత్తిగాని వాంఛలు గాని యతని చిత్తమును వశము చేసికొనగూడదు. స్వభావము ప్రేరేపించినట్లు ప్రవర్తించుట రాజధర్మమున కుచితము కాదనుకొందును.

జ: ఆర్యుల యభీష్ట మేదియో తెలిసికొనగోరుచున్నాను. దాని కీ తర్కవితర్కములతో సంబంధము లేదనుకొనెదను

బ్రా: లేదనియే నా యభిప్రాయము. ! అయినను మహారాజులు——

జ: ఆర్యుల పరిచయభాగ్య మింతవరకును లభింపలేదు.

బ్రా: నన్ను శివదత్తు డందురు.

జ: తరువాత ?

బ్రా: కాన్యకుబ్జాధిపతియు ఆది వరాహుడు నగు శ్రీమాన్ మిహిరభోజుని యాచార్యుడను. వారికులపురోహితుడను.

జ: (చిరునవ్వుతో) కాన్యకుబ్జాధీశ్వరుడు మహావీరుడు నగు మిహిరభోజు డందరికిని పరిచితుడే! కాని ఆదివరాహుడను విశేషణము మాత్ర మర్థము కాలేదు.

శి: అది ఆ మిహిరభోజునకే తెలియును. ఇచటి వారెరుగుదురో ఎరుగరో. కాన్యకుబ్జ ప్రజలందరు ఆయుష్మంతుడగు మిహిరభోజుడు శ్రీ మహావిష్ణు నవతారమగు ఆది వరాహుని యంశమున జన్మించినాడని విశ్వసించుచున్నారు.

జ: అట్టి దెప్పుడును వినియుండలేదు. అయినను ఆ ప్రజ లట్లు విశ్వసించుటకు తగిన ప్రమాణమేదియో తెలిసి కొన నచ్చునా?

శి: ఆయుష్మంతుని జననియగు సుభద్రాదేవి వ్రత చారిణియై బహుకాలము శ్రీ మహావిష్ణువు నారాధించినది. తత్ఫలితముగా నతనిని గర్భమున ధరించియున్నప్పుడు, శ్రీ మహావిష్ణువు ఆది వరాహరూపముతో తన గర్భ ములో ప్రవేశించినట్లు లామె స్వప్నముగాంచినది.

జ: ఈ స్వప్న మెక్కటియే యగునా ఆ విశ్వాస మునకు ప్రమాణము?

శి: ఆయన ప్రజలందరు ఈ స్వప్నమునే పరమ ప్రమాణముగా నంగీకరించి ఆయన కట్టి విశేష్యత్వ మొసగి నారు. అట్టి పూజ్యభావముతోనే ఆయనమీద భక్తి శ్రద్ధలు కలిగియున్నారు.

జ: ప్రజలు తమ ప్రభువును సాక్షాన్మహావిష్ణువని విశ్వసింప వచ్చును. వారి విశ్వాసము నధిక్షేపించుట కిత రుల కెట్టి కారణమును లేదు. ఎంతవరకు? దానిని స్థిరపరవ వలసిన బాధ్యత కలుగనంత వరకు!

శి: కోసలేశ్వరులకు గాని వారి ప్రజలకుగాని యట్టి బాధ్యత కలిగించు నభిప్రాయము గాని యధికారము గాని యెవ్వరికిని లేదు. కాని శ్రీమాన్ మిహిరభోజుని కులీనత నంగీకరించుటకు మహారాజులకెట్టి యభ్యంతరము లేదని తలచెదను.

జ: మిహిరభోజుడు శక్తిమంతుడు, ప్రతిష్ఠావంతుడు నగు మహారాజని అందరు నంగీకరించి తీరవలసినదే!

శి: అట్లయిన నతడు కులీనుడు కాడందురా!

జ: ఆయన కులీనతను గురించి నాకేమియు తెలియదు.

శి: తెలియనప్పుడు రాజైనవాడు ఇతరరాజుల కులీనతను సందేహింప వచ్చునా?

జ: సత్కులసంభూతులైనవారి కులీనతను గురించి సాధారణముగా సందేహము కలుగనిమాట వాస్తవము.

శి: అనగా మిహిరభోజుడు సత్కుల ప్రసూతుడు కాడనియే గదా! మరి కోసలరాజు లేకులమున జన్మించినవారు?

జ: ప్రఖ్యాతమైన సూర్యవంశమున. ఆ వంశము నవీనము కాదు; అపరిచితమును గాదు.

శి: మిహిరభోజుడు ప్రసిద్ధమైన అగ్నికులమున జన్మించినవాడు. ఆ కులము కేవలము ప్రాచీనము కాకున్నను ఇపుడు అపరిచితమైనది మాత్రము కాదు. అంతియేకాక ఈభూమిపై సూర్యతాపముకన్న అగ్నితాప మెక్కువయే కాని తక్కువ కాదు.

జ: ఆర్యా! ఆ తాపమువల్ల అసత్కులశోణిత మింకి పోవచ్చును. కాని సుక్షత్రియ శోణితముగా పరిణమింప జాలదు.

శి: మహారాజా! బాహుబలమం దెవడు శ్రేష్ఠుడో అతడే క్షత్రియుడు. శాస్త్రవిధి ననుసరించి ఎవడు ప్రజల

పాలించునో, రక్షించునో, రంజించునో, అతడే రాజు. అది యట్లుంచి వేదమార్గ మనువర్తించువాడు ఆర్యుడగును కాని అసత్కులసంభవుడు కాజాలడు.

జ: ఆర్యరక్త మెవరి శరీరమున ప్రవహింపదో అట్టివా డార్య ధర్మావలంబియైనను ఆర్యుడని గ్రహించుటకు వీలు లేదు. కల్పితమైన ఈ యగ్నికులము సుక్షత్రియకుల మని సుక్షత్రియు లెవ్వరు విశ్వసింపలేరు.

శి: తమ సూర్యకులము కల్పితము కాదని ఎట్లు చెప్ప వచ్చును? బహుకాలము క్రిందట కల్పితమైనది అగుట చేతనా?

జ: ప్రాచీనమైనది నూతనమైన దానికన్న విశ్వాసార్హమైనది.

శి: నూతనమైనది కూడ చిరకాలము నూతనముగా నుండదు. ప్రాచీనమైనది జీర్ణమై పోయినపుడు నవీనమైనది దాని విశ్వాసస్థానము నొందును. ఇపుడీ నూతనమైన అగ్ని కులము అట్టి విశ్వాసస్థానము పొందియున్నది; ఇకముందు గూడ పొందగలదు. తమరు ప్రాచీనత నెంత గౌరవించినను అది స్వాభావికమైన క్షీణత నొంది తన శక్తిని గోలుపోయినది. నిర్వీర్యము లైన క్షత్రియబాహువులు సనాతన ధర్మమును గాని సనాతన సంప్రదాయమును గాని రక్షింపలేక పోయినవి. అపుడు బ్రాహ్మణులు యజ్ఞము లాచరించి తత్పవిత్ర తేజస్సుచే మహాబలసంపన్నమైన క్షత్రియకులముల నిర్మించిరి. ఈ నూతనక్షత్రియులే భారతదేశమున క్షత్రియ శ్రేష్ఠులస్థాన మలంకరించెదరు. అట్టి దినములు రాగలవు.

సూర్యకులము చంద్రకులము అగ్నికులము మొదలైన వన్నియు సుక్షత్రియ కులములై భారతదేశమును శాసింప గలవు. ఈ క్షత్రియులే రాజపుత్రులను పేరుతో భారత దేశమున గౌరవము నొందగలరు.

జ: అసత్కులజులకు క్షత్రియత్వ మిచ్చుగల అధికారము బ్రాహ్మణులకు గలదా?

శి: బ్రాహ్మణులకే కలదు. ధర్మమును సమాజమును రక్షించుటకు బ్రాహ్మణులే చాతుర్వర్ణ్యవిధానము ప్రవర్తింప జేసినారు. ఆ విధానము భంగమై జీర్ణమైపోయినపుడు నూతన శక్తి నొసగి సమాజము నుద్ధరించుట బ్రాహ్మణుల విధి.

జ: అగుగాక! మహానుభావా! ఈ తర్కమువలన కించిత్తైన ప్రయోజనము కలదా! అజ్ఞాతకులజుడు, నాగభట్ట పౌత్రుడు, రామదేవపుత్రుడు నగు మిహిరభోజు డుత్తమ క్షత్రియవంశజుడుగా భారతదేశమున ప్రశస్తినొందుగాక! ఇక ముందతని వంశ మట్టి గౌరవము బడయుగాక! నేడీ వాదోపవాదములతో నది నిర్ణీతము కాజాలదు. కనుక ఈ తర్కమువల్ల నీషన్మాత్రము ప్రయోజనము లేదు.

శి: ఉన్నది, మహారాజా! ఉండుటచేతనే ఇంత దూర మీ తర్కములోనికి దిగినాను.

జ: అది యెట్టిది?

శి: భారతదేశమునకు, అందు ప్రతిష్ఠితమైన సనాతన ధర్మమునకు మంగళమే ప్రయోజనము. ప్రాచీనక్షత్రియులు

అస్పృశ్యకులములతో స్వేచ్ఛగా గలసిపోయి సమానప్రతిపత్తిగల క్షత్రియ వంశములుగా పరిణమించుటయే ప్రయోజనము.

జ: స్వార్థపరులైన ఉచ్చకులజు లేకొందరో నీచకుల జులతో గలసి పోవచ్చును. అంతే! అంతకన్న ఎక్కువ ప్రయోజన ముండదు.

శి: ఆ స్వార్థ మే దేశములో నెంతదూరము వ్యాపించునో, ఎవ రెవరిని మేళవించునో సులభముగా నిర్దేశింప వీలులేదు. అన్యోన్యాత్మీయత దృఢపడుట కట్టి సమ్మేళన మత్యావశ్యకము.

జ: తమ యభిప్రాయము స్పష్టముగా సెలవిండు.

శి: కల్యాణి యగు తమ కుమారి శ్రీమతి కుంతలను నా శిష్యుడగు శ్రీ మన్మిహిరభోజునకు ధర్మపత్నిగా నభ్యర్థింప వచ్చినాను.

జ: బ్రాహ్మణోత్తమా! తమ యభీష్టము సఫలము చేయుటకు నే నశక్తుడను, నమస్కారము. విజయవతీ! ఈ బ్రాహ్మణోత్తముడు నేడు మా కతిథి. వీరి నంతఃపురము నకు దీసికొనిపొమ్ము. వీరికెట్టి లోపము కలుగకుండ ఉచిత రీతి సత్కారింపు మని రాణిగారితో చెప్పుము.

శి: కోసలరాజునకు మంగళ మగుగాక! మహారాజా! తమ యాతిథ్య మంగీకరించుటకు వీలులేదు.

జ: (కరములు జోడించి) ఆర్యా! తమరు బ్రాహ్మణోత్తములు. మాగృహమున కరుదెంచితిరి. ఏమి యపరాధము చేసినానని నాకు తమ సేవ లేకుండ జేసెదరు.

శి: మహారాజా! నా ప్రార్థనము తిరస్కరించిన తరువాత తమ వినయము పరిహాసముగా గనబడుచున్నది. ఏది ఎట్లైనను ప్రార్థినై వచ్చి అవమానితుడనైతిని గదా! ఇక రెండు కబళముల కోసమా తను యింట నాతిథ్యము గ్రహించుట! అట్టి అభిరుచి భిక్షుకున కుండిన నుండుగాక! నాకు మాత్రము లేదు.

జ: మహానుభావా! ప్రార్థయితల ప్రార్థన లన్నియు నెవ్వరు సఫలము చేయలేరు. తమరు పండితులు. అందు కోసము క్రుద్ధులై అతిథిసేవనుండి వంచించి నన్నధర్మము పాలు చేయుట తమ వంటి వారికి శోభింపదు.

శి: నేను తమ ఆతిథ్యము గ్రహించుటకు రాలేదు. అట్టి యభ్యర్థనము కూడ చేయలేదు. ఇపుడు స్వేచ్ఛగా సెలవు తీసికొనుచున్నాను. అందువల్ల తమరెట్లధర్మము పాలగుదురు? నన్నతిథినిగా సేవింప నెంచినారు, కాని నేను దాని నంగీకరింపలేదు. కనుక తమ ధర్మము రక్షిత మగుచున్నది.

జ: ఆర్యా! ఇదే నా నమస్కారము. రాష్ట్రవిషయములో తమ ప్రభువుల మైత్రి తిరస్కరింప లేదనియు, వివాహవిషయములో వారితో సంబంధ మంగీకరింప జాలననియు తమ ప్రభువులకు నివేదింపుడు.

శి: ఇందులకు ప్రత్యుత్తరము నా శిష్యుడు శ్రీమన్మహిరభోజు డొసగ గలడు. నేను వారి కురిపురోహితుడను. కాని సచివుడను గాను. ఇక సెలవు. తమకు మంగళమగు గాక!

శివదత్తుడు ధీరముగా దృఢపద విక్షేపముతో సభా గృహమునుండి వెడలిపోయెను.

2

జయంతదేవుడించుక సేపు చింతాన్వితుడయ్యెను. అపుడు ప్రధానామాత్యుడు నారాయణదేవుడతనిని సమీపించి, "మహారాజా! ప్రబలప్రతాపాన్వితుడగు మిహిర భోజుడీయవమానము సహించడు. యుద్ధమునకు సిద్ధపడుము" అని విన్నవించెను.

జ: అగును, సిద్ధపడవచ్చును. సైన్యము నాయత్తము చేయుమని సేనాపతి కాజ్ఞ యిమ్ము. ఆ బ్రాహ్మణు డెట్లెట్లు ప్రయాణము చేయునో కనిపెట్టుటకు చతురుడైన చారుని నియోగింపవలసిన దని నగరపాలకున కాజ్ఞ ఇమ్ము.

నా: చిత్తము. కాని——.

జ: ఇంక నేమి, నారాయణదేవా!

నా: మన కోసలము కన్న కాన్యకుబ్జ మెన్నియోరెట్లు శక్తిమంత మైనది. మిహిరభోజుడు స్వయముగా మహా వీరుడు.

జ: అయినను ఉపాయము లేదు, ఆర్యా! కులగౌరవ రక్షణార్థము ప్రాణము లొడ్డియైనను యుద్ధముచేసి తీరవలసి నదే! నేడు మిహిరభోజుడు రాజ్యలోభముచే యుద్ధమునకు వచ్చు ననుకొనుము. అట్టియెడ యుద్ధము చేయక యే ప్రబలుడని అతని హస్తములందు రాజ్యము సమర్పింతుమా?

నా: మిహిరభోజుని తండ్రి యగు రామదేవునకు మధురారాజగు సుబాహుఁడు కన్య నిచ్చినాఁడని విని యున్నాను. ఆ కన్యయే మిహిరభోజుని జనని.

జ: మధురారాజు యదువంశీయుఁడని వింటిని. యథార్థము తెలియదు. ఏది యెట్లైనను అపవాదదూషిత మైన అతని తండ్రి యదువంశ సంబంధముకన్న మా సూర్యవంశ మెన్నియో రెట్లు ఎక్కువ గౌరవము కలది.

నా: మహారాజా! ఆ యదువంశమునందే కదా శ్రీకృష్ణుడు జన్మించినది ?

జ: నిజమే. అయినను శ్రీకృష్ణుడుకూడ పూరువంశీయుఁడగు యుధిష్ఠిర మహారాజు ప్రాధాన్య మంగీకరింపవలసి వచ్చినది. అది యట్లుంచి యా యదువంశమున మహనీయుఁడగు శ్రీకృష్ణుఁడు జన్మించినాఁడంటివేని, రాజాధిరాజును పురుషోత్తముఁడును అగు శ్రీరామచంద్రుని జననముచే మా సూర్యవంశము ఖ్యాతి గాంచినది. మా కోసలదేశము ధన్యమైనది.

నా: తమ కోసల సూర్యవంశీయుఁడగు కనకసేనుని సంతతివారు దక్షిణ మహభూమి ప్రాంతముల రాజ్యము చేయుచున్నారు. వారికిని అగ్నికులరాజులకును వైవాహిక సంబంధము లేర్పడియున్నవి.

జ: కనకసేనుని పేరు ఎప్పుడును వినియుండలేదు. అతనిది కోసలసూర్యవంశపు శాఖ కావచ్చును. అయినను ఆశాఖ కాండభ్రష్టమై పతిత మైన దని తలపవలెను. వారి ఆచార వ్యవహారములు మన మనుసరించుటకు వీలు లేదు,

నా: మహారాజుల చిత్తము. నేను తమ అధీనుడను. ఇక సభ చాలింతురా?

జ: అలాగే. రాజకార్యములందు బుద్ధి ప్రవేశించుట లేదు.

నిజముగా యుద్ధ మారంభ మయ్యెను.

అవమానితుడై శివదత్తుడు కాన్యకుబ్జమున కరిగి, "కోసలరాజకన్యకను కులవధువుగా గృహమునకు దీసికొని రాగలిగిననాడు గర్వితుడగు జయంతదేవుని తిరస్కారము మరచిపోగలను" అని మిహిరభోజునితో జెప్పెను.

పితృసమానుడు, కులపురోహితుడు, శిక్షాగురువు నగు శివదత్తుని మనస్సంక్షోభము చూచినంతనే మిహిరభోజున కత్యధికక్రోధము కలిగెను. భారతదేశములో ప్రాచీన క్షత్రియు లగు సూర్యచంద్రవంశస్థులు కొంద రీవిధముగ నతని క్షత్రియత్వము నవమానించు చుండుట ప్రబలప్రతాపాన్వితుడు, తేజస్వి యువకుడు నగు మిహిరభోజుడు సహింపలేక పోయెను. అత డిట్లు భావించెను: "గురుని యిష్టానుసార మీ యవమానమునకు ప్రతిక్రియ చేయజాలక పోయితినేని నా క్షత్రియగౌరవము వృథాయగును. అంతేకాక ఆ రాజవంశస్థులు తమంతట తా మగ్నికులుల సన్మానింపనప్పుడు తద్గౌరవము బాహుబలముచే సాధించుకొనవలసి యున్నది. ఇపుడు వా రగ్నికులుల భారతదేశమున సుప్రతిష్ఠి

తుల జేయనున్న నాక్షత్రియజీవనము వ్యర్థమగును. అంతే కాక నాపితృపితామహాదులు ఏ యజ్ఞాగ్ని పవిత్ర తేజముతో క్షత్రియులై నూతనజన్మము నూతనజీవనము నొందినారో ఆ తేజ మంతయు నిరర్థక మగును. ఇక జాని నీదేహమున ధరించి యేమి ప్రయోజనము. ప్రాచ్యభారత దేశములోని భూపాలు రేకమై యెత్తివచ్చినను నాశక్తి నతిక్రమింపలేరు. అట్టియెడ దుర్బలుడైన యీ కోసలరాజొక లెక్కయా! ఒక్కమాసము లోపల కోసలరాజు తన కుమారిని నా హస్తములందు సమర్పించి కృతార్థత నొందవలెను. ప్రాచీనజీర్ణసూర్యవంశ నతశిరస్కుడై మహాపరాక్రమాన్వితు డగు నవీనాగ్ని నర్చించి తీరవలెను. నాకన్న కాన్యకుబ్జ గౌరవముతో పరిక్షిపించు రాజకిరీటము శిరమున ధరించి కలంకితము చేయజాలను.”

అవిలంబముగా కాన్యకుబ్జమునుండి సైన్యముల వెంట గొని పోయి మిహిరభోజుడు కోసలదేశము నాక్రమించెను. అతని ప్రచండాక్రమణమునకు సహింపలేక కోసలసైన్యము పరాభూతమై వాడిపో జొచ్చెను. మూడు వారములలో మిహిరభోజుడు ససైన్యముగా కోసలరాజధాని యగు శ్రావస్తినగరము సమీపించెను.

శ్రావస్తినగరము కోసలదేశమునకు ఉత్తరమున హిమాలయ పాదమునందున్నది. దాదాపు కోసలదేశ మంతయు మిహిరభోజుని హస్తగతమైనది. శ్రావస్తినగరము పడిపోయినచో కోసలమందు ప్రాచీన సూర్యవంశ ప్రభుత్వ జ్యోతి చల్లారిపోవును. అందగ్నికులుల దీప్తి ప్రకాశించును.

రాజధాని నరికట్టి మిహిరభోజుడు జయంతదేవు కడకు దూత నంపెను. దూత యిట్లు నివేదించెను: "రాజకుమారి యగు కుంతల నర్పించినచో కోసలేశ్వరునకు రాజ్యము స్వాతంత్ర్యము నొసగి సంధిచేసికొనుటకు మిహిరభోజుడు సిద్ధముగా నున్నాడు. విజయి యగు వైరిని జయంతదేవుడు జామాతగా నంగీకరించు నేని మిహిరభోజుడు శ్రద్ధాభక్తులతో మామగారి చరణములకు నమస్కరించి పత్నీసమేతుడై స్వరాజ్యమునకు తిరిగిపోవును. కోసలకాన్యకుబ్జములకు స్నేహబంధమును ఆత్మీయతయు చిరకాల మవిచ్ఛిన్నముగా నిరభ్యంతరముగా నిలిచియుండును. సంధి కాని పక్షములో కోసలదేశము కాన్యకుబ్జపు కఠోరశాసనమునకు కష్టనిష్ఠురలోనుగావలసివచ్చును."

జయంతదేవుడు సంధి కిష్టపడ డని తెలిసికొని ఆమాత్యులును నాగరకముఖ్యులును గలసి యాలోచించి నిశ్చయించుకొని తమ యభిప్రాయము జయంతదేవున కిట్లు నివేదించిరి: "మహారాజా! ప్రజలకల్యాణము నుద్దేశించి తాము మిహిరభోజునితో సంధిచేసుకొనుట యవసరము. ఏ రాజవంశీయులు క్షత్రియు లను పేరుతో భారతదేశమున సుప్రతిష్ఠితులై యున్నారో వారి శౌర్య వీర్యములును ధర్మాసక్తియు ప్రాచీన క్షత్రియుల కన్న హీనములు కావు. ఇంతకు పూర్వమే వారికి సూర్యచంద్రవంశీయులతో వైవాహిక సంబంధ బాంధవ్యములు కలవు. అట్టి రాజవంశీయుడును ప్రతాపశాలియు నగు మిహిరభోజుని హస్తములందు రాజకుమారి నర్పించినచో కోసలరాజుల కెట్టియవమానము

కలుగబోదు. ఒక వేళ తమ మనస్సునకు కష్టముగా నున్నను ప్రజాక్షేమము కొఱకు అట్టిది అంగీకరింపక తప్పదు. రాజు కేవలము తన కులగౌరవము మాత్రమే చూచుకొనక ప్రజల శ్రేయస్సు గూడ నాలోచింపవలెను. ప్రజాసంతుష్టికై శ్రీ రామచంద్రుడు ప్రేమాస్పదయు నిష్కళంకయు పట్టమహిషియు నగు సీతాదేవిని గూడ పరిత్యజించినాడు. నేడు మహారాజులు ప్రజాక్షేమార్థము - తమ ప్రజలు పరప్రభుత్వదాస్యము పాలు కాకుండుటకు - తమ పుత్రికను సమర్పించుట ఉత్తమ ధర్మము."

నిరుపాయు డగు జయంతదేవు డిట్లు వచించెను: "మంచిది. ప్రజాబృంద మట్లు నిర్ణయించినప్పుడు నేను కుమారిని తప్పక అర్పించెదను. కాని మిహిరభోజు నాహ్వానించి గృహమునకు గొనివచ్చి జామాతగా నర్చించి కన్యాదానము మాత్రము చేయలేను. కుంతల నతనివద్దకు పంపెదను. ఆమె స్వేచ్ఛగా నతనిని వరింపవచ్చును. దీనితో సంతుష్టుడై యతడు కోసలరాజ్యము వదలిపోవును గాక! ఆర్యా, నారాయణదేవా! ఈ విషయములో సమస్త భారము వహించి కర్తవ్యమంతయు తామే నిర్వహింపుడు. నే నశక్తుడను."

జయంతదేవు డశ్రుసిక్త నయనములతో పూజామందిరములోనికి వెళ్ళెను. మిహిరభోజు డీ సంధి కంగీకరించెను. వెంటనే రాజకుమారి కుంతలను అనుచరులతోడను దాసదాసీజనముతోడను మిహిరభోజుని శిబిరమునకు పంపిరి.

## 4

"అమ్మా! నిన్ను ఆశీర్వదింప వచ్చినాను!"

నగరమునకు బయట సైనికశిబిరములకు వెనుక కొన్ని మనోహరములైన యుద్యానగృహములు గలవు. ధనవంతులైన నాగరకులు వానిలో చిత్తవినోదనార్థము నడుమ నడుమ నివసించుచుందురు. నగరము వరికట్టియున్న కాలమున మిహిరభోజుడు వానిలో నొకగృహమందు నివాస మేర్పరచుకొనెను. ప్రక్కయింటియందు రాజకుమారి కుంతల యుండుట కేర్పాటు చేసెను.

కుంతల కిటికీ ప్రక్క కూర్చుండి బయటికి చూచుచు నేదియో యాలోచించుచుండెను. అప్పు డాకస్మికముగా నెవ్వరో ద్వారము తెరచుకొని వచ్చి, "అమ్మా! నిన్ను ఆశీర్వదింప వచ్చినాను" అని పలికిరి. కుంతల యులికిపడి తిరిగి చూచెను. దీర్ఘకాయుడును తేజోవిభాసితమూర్తియు నగు బ్రాహ్మణు డెదుటికి వచ్చెను.

కుంతల లేచి నిలుచుండి ఆయనవంక తేరిపార చూచుచు "తమరెవరు, మహాత్మా! చూడగా బ్రాహ్మణులవలె కనబడుచున్నారు. తమరు కాన్యకుబ్జనివాసు లనుకొనెదను. విజితుడైన శాత్రవుని కన్యయని నన్ని ట్లవమానించుచున్నారా! కాన్యకుబ్జ నివాసుల సౌజన్య మిదియేనా?" అని పలికెను.

బ్రాహ్మణుడు మందహాసముతో "అమ్మా! ఈ నీ తేజస్వితప్రశంసనీయము, రాజమహిమకి యోగ్యమైనది! నిన్ను

అవమానించు నభిప్రాయము లేదు, తల్లీ! మాతృసంబో ధనము చేయుచు నేను నీ గృహములో ప్రవేశించినాను. జనని గృహములోనికి సంతానము వచ్చుటకు ఏదియైన సౌజన్యవిధాన మనుసరింపవలెనా, తల్లీ!" అని పలికెను.

అభిమానపూర్ణస్వభావుడు నిర్భయుడు నగు నా బ్రాహ్మ ణుని ధీర శాంత మధుర వాక్యములతో కుంతల హృదయ మించుక సంకుచిత మయ్యెను ఆమె కించుక లజ్జయు భయ మును కలిగెను. ఆమె కొంతసేపు మౌనముగా నుండి, "ఆర్యా! నన్ను క్షమింపుడు తాము అపరిచితులు. అంతే కాక ఆగమనవార్త కూడ ముందుగా పంపి యుండలేదు. ఆకస్మికముగా నా నిర్జన గృహములోనికి వచ్చుటచే సంచుక విచలిత నైతిని'' అని పలికెను.

బ్రా: తల్లీ! సంభ్రాంత లగు కులకన్యల లక్షణ మిట్లే యుండును. ఇందుకోసము నిన్ను అపరాధినిగా గ్రహింపను. నేను కూడ కుమారునికి గల యధికారముతో విచారింపక తల్లి యింటిలోనికి ప్రవేశించితిని.

కుం: తమరు సస్నేహముగా 'తల్లీ!' యని సంబోధించు చున్నారు. అట్టి స్నేహమునకు నే నెట్లు యోగ్యురాలనో తెలిసికొనలేకున్నాను.

బ్రా: తల్లీ! నేను మీ కులపురోహితుడను. నా బిడ్డ వలె నీవును నాస్నేహమునకు పాత్రురాలవు.

కుం: కులపురోహితులా! కోసలరాజకుమారికి తమరు కుల పురోహితులా! కోసల రాజాంతః పురములో తమ్ము నెప్పుడు చూచి యుండలేదు.

బ్రా: అమ్మా! నీవు బుద్ధిమతివి, ధర్మశీలవు! నేడు నీ సంతానము నెడ నెందుల కిట్లు కపటముగా ప్రవర్తించు చున్నావు! నేను కోసలదేశస్థుడను కానవియు, కాన్యకుబ్జ రాజ కులపురోహితుడ ననియు నీవు గ్రహింపలేకున్నావా?

కుం: కాన్యకుబ్జ రాజ కులపురోహితులు కోసలరాజ కన్యాసమక్షములో నామె కులపురోహితుల మని చెప్పుకొందురని నే నెట్లనుకొందును?

బ్రా: కోసలరాజు కాన్యకుబ్జరాజునకు నిన్ను కుల వధువుగా సమర్పించియున్నాడు. వివాహము జరుగకున్నను జరుగు నను ధైర్యముతో నిన్ను వధువుగానే తలచితిని. అందుచేత నే వధువవైన నిన్ను ఆశీర్వదింప వచ్చితిని

కుం: నా జనకులు సంధిశుల్కముగా నన్నిచటికి పంపిన మాట వాస్తవమే. కాని వారు సంకల్పపూర్వకముగా నెవరి హస్తములందును నన్ను సమర్పించి యుండలేదు.

బ్రా: అటులైన నిన్నెందుకు పంపినారు? సంధిశుల్కము మాత్ర మెవరి కోసము?

కుం: ఆ విషయము తండ్రిగారు నాతో నేమియు చెప్ప లేదు. వచ్చుటకుముందు నాకు వారి దర్శనము కూడ కాలేదు. అమాత్యులు నన్ను పంపినారు. నన్ను వినిమయముగా నిచ్చిన కాన్యకుబ్జరాజు విజిత ప్రాయమైన కోసలరాజ్యము వదలి పోవునని అమాత్యాదులు పలుకు చుండగా వింటిని.

బ్రా: నిజమే, తల్లీ! విజిత ప్రాయమైన కోసలరాజ్య మునకు వినిమయముగా కాన్యకుబ్జరాజు నిన్నెందు కొరకు కోరుకొన్నాడు?

కుం: ఆర్యా! అది యీ కాన్యకుబ్జరాజునకే తెలియవలెను. నే నెట్లు చెప్పగలను?

బ్రా: మంచిది, అట్లయిన నేను చెప్పుచున్నాను: కాన్యకుబ్జరాజు నిన్ను తన కుల వధువుగా - పట్టమహిషిగా కోరుచున్నాడు.

కుం: ఆయన కోరుకొని యుండవచ్చును, కాని తండ్రిగారు నన్నందు కోసము దానము చేసినట్లు వినియుండలేదు.

బ్రా: అట్లయిన ఎందుకోసము దానము చేసినాడు?

కుం: రాజ్యమునకు బదులుగా-సంధిశుల్కముగా.

బ్రా: అమ్మా! నీవు పొరపడి వాదించుచున్నావు. నిన్ను సంధిశుల్కముగా దానముచేసినారని పలికితివి. ఆ దానమున కుద్దేశ ముండవలెను గదా! ఆ యుద్దేశమును గురించి మన మిపుడు మాటాడుచున్నాము.

కుం: ఉద్దేశము సంగతి నా కేమియు తెలియదు.

బ్రా: ఇపుడు నేను తెలిపితిని గదా!

కుం: మంచిది, తెలిసికొన్నాను, తమకు నమస్కారము చేయుచున్నాను.

బ్రా: తల్లీ! దీర్ఘాయుష్మతివి కమ్మా! ధర్మబుద్ధివి కమ్మా! ఇక నిన్ను ఆశీర్వదింపవచ్చునా?

కుం: ఇపు డాశీర్వదించినారు కదా!

బ్రా: అది నీ ప్రణామమునకు ప్రత్యుత్తరము. అది పెద్దలకు నమస్కరించి నపుడు సామాన్యముగా స్త్రీలకు చేసెడి ఆశీర్వాదము.

కుం: అట్లయిన మరల నెందుకు?

బ్రా: కాన్యకుబ్జరాజునకు కాబోవు వధువును ఆయన కులపురోహితుడ నగు నేను ఆశీర్వదింపవచ్చినాను.

కుం: ఆర్యా! తండ్రి నన్ను త్యజించినాడు. నా కింత వరకు భర్త ఏర్పడలేదు. కనుక నా విషయములో నేను స్వతంత్రురాలను.

బ్రా: ఆ స్వాతంత్ర్య విషయ మిపు డెందుకు చెప్పుచున్నావు, తల్లీ!

కుం: చెప్పవలసివచ్చినది. ఎందుల కనగా తమ యాశీర్వచనము నే నిపుడు గ్రహింపనని చెప్పటకు.

బ్రా: ఎపుడు గ్రహించెదవు ?

కుం: ముందు కాన్యకుబ్జ మహారాజు నొకసారి దర్శింప గోరుచున్నాను. తరువాత—

బ్రా: తరువాత నా యాశీర్వాదము గ్రహింతువా!

కుం: ఆ విషయ మప్పుడు నిర్ధారణ చేసెదను.

బ్రా: (దృఢస్వరముతో) తల్లీ! ఒక్క సంగతి జ్ఞాపక ముంచుకొనుము. తండ్రి నిన్ను త్యజింపలేదు. శుల్కబద్ధురాలై యిచటికి పంపియున్నాడు.

కుం: (ధీరస్వరముతో) వారి శుల్కము రక్షించుటకే నే నిచటికి వచ్చియున్నాను. వివాహ మగునంతవరకు తండ్రికి కౌమార్తెపై నధికారము కలదు. ఆ యధికార మాయన త్యజించినాడు.

బ్రా: అధికారము త్యజింపలేదు. దాని నన్యులయం దుంచినాడు.

శకుం: ఆర్యా! తాము గొప్ప పండితులు, భర్తయందు కాకుండ స్త్రీ జీవనాధికారము కేవలియుం దుంచుట కవకాశ ముండును?

బ్రా: తల్లీ! మిహిరభోజుడు నీకు భర్తయే యగును కదా!

శకుం: ఇప్పటికిని కాలేదు, అందుచేత ధర్మప్రకారము నా విషయమున నేనే స్వతంత్రురాలను.

బ్రా: అట్లయిన నీ తండ్రిగారి శుల్క మేమి చేసెదవు?

శకుం: శుల్కము పాలింపకపోవుట లేదు, అట్టి అభిప్రాయము కూడ లేదు. అంతేకాక మిహిరభోజునకు సంపూర్ణముగా నాత్మసమర్పణము చేసికొనుటకు సిద్ధముగా నున్నాను. కాని అంతవరకు నాకు నేనే స్వతంత్రురాల నని చెప్పుచున్నాను. ఆ స్వాతంత్ర్యాధికారము తోడనే తమ యాశీస్సు నిపుడు గ్రహింప నని చెప్పితిని.

బ్రా: మంచిది. మిహిరభోజుని దర్శింపగోరుచున్నావా?

శకుం: అగును. వారి యాజ్ఞయైన.

బ్రా: ఆజ్ఞయేమి, తల్లీ! సంతోషముతో నిన్నాయన దర్శించును. ఆయన నిచటికి రప్పించుదునా?

శకుం: వారి యిష్టము. వారి వద్దకు వచ్చుటకు నేను సిద్ధముగా నున్నాను.

బ్రా: మంచిది. నీ యభిప్రాయము వారికి తెలియజేసెదను. తరువాత వారి చిత్తము.

శకుం: ఈ దాసి ప్రణామము గ్రహింపుడు.

బ్రా: దీర్ఘాయుష్మతివి కమ్మ, తల్లీ!

శివదత్తుడు మెల్లమెల్లగా వెళ్ళిపోయెను. పోవుచు నతడి ట్లనుకొనెను: "కోసలరాజును జయించి చివరకీ బాలచే పరాజితుడ నగుదునా యేమి! విధాత యెట్లు సంకల్పించి నాడో యెవరి కెరుక! మిహిరభోజా! ఈ బాలయే నీకు తగిన మహిషి! ఈమె నీకు లభించెనేని నీరాజ గౌరవము సంపూర్ణ మగును!

5

పరిచారిక వచ్చి, "దేవీ! మహారాజు తమ దర్శనము చేయగోరుచున్నారు, వారు వచ్చుటకు తమ కెట్టి యభ్యంత రము లేదు గదా!" అని పలికెను.

కుంతల యించుక చకితయై, పరిచారికవంక తేరిపార చూచి, ఏదియో యూలోచించి, " నేను దేవిని గాను, న న్నెందుల కట్లు సంబోధించుచున్నావు?" అనెను,

పరి: తమ్ము నట్లు సంబోధించు మని ఆజ్ఞ యైనది.

కుం: ఆజ్ఞ యిచ్చిన దెవరు?

పరి: ఆర్య శివదత్తుడు.

కు : ఆర్య శివదత్తుడా! మహారాజు కాదా?

పరి: కాదు, రాజకుమారీ! తమ గృహసంబంధమైన మంచి చెడ్డలు విచారించు భార మార్యశివదత్తుడు వహించి నాడు. సమస్తమైన ఆజ్ఞలు ఆయనయే ఇచ్చుచున్నాడు.

తమరు వచ్చిన తరువాత మహారాజుటువైపుకూడ వచ్చి నట్లు లేదు.

కుం: హుం! ఏమనుచున్నావు! మహారాజు నన్ను స్మరించినారనియా?

పరి: కాదు, రాజకుమారీ! మహారాజు తమ దర్శనము కొరకు వేచియున్నారు. రావచ్చునో కూడదో తెలిసికొన గోరుచున్నారు.

కుం: (ధీరస్వరముతో) స్వేచ్ఛగా రావచ్చును. ఎందులకు రాకూడదు? ఏమాత్రము ముందుగా వారి యభీష్టము తెలిపినను నేను సిద్ధముగా నుండగలను. పొమ్ము. వారిని తీసికొని రమ్ము. వారు నా యనుమతి కొరకు వేచియుండుట నాకు చాల సిగ్గుగా నున్న దని చెప్పుము. అనుమతి నపేక్షించు టెందులకు? వారి యాజ్ఞ పాలించుటకు నేను సర్వదా సంసిద్ధురాలను.

పరిచారిక వెడలిపోయెను. కుంతల శరీరము కంపింప దొడగెను. హృదయము దడదడ కొట్టుకొన సాగెను. ఆమె ఇట్లను కొనెను: "ఇప్పుడు భయపడి ధైర్యము కోలుపోయిన కర్తవ్యము భంగమగును. మనస్సు స్థిరము చేసికొని వారి కాత్మ నివేదనము చేసికొన వలెను. కానున్న—"

బయట వాద్యముల చప్పుడు వినబడెను. కుంతల శరీరము మరింత వణకెను. గుండెలు మరింత దడదడ కొట్టుకొనెను. శక్తినంతయు కూడదీసికొని యామె స్థిరచిత్తముతో దృఢ సంకల్పముతో పర్యంకమునుండి లేచి ప్రక్కకు జరిగి నిలుచుండెను.

పరిచారిక లోనికి వచ్చి, 'మహారాజు లోనికి రావచ్చునా?' అని అడిగెను.

కుంతల యించుక మందహాసము చేసెను. "తన యధీన మందున్న శుల్కక్రీత యగు దాసియెడ విజయియు, వీరుడును క్రేతయు నగు ప్రభువున కింత సౌజన్యమా! ఇంత సభ్యతయా!" అనుకొనెను. తరువాత నామె, "అలాగే దయ చేయు డని చెప్పుము" అని పలికెను.

పరిచారిక తలుపు తెరచెను. మిహిరభోజుడు లోనికి వచ్చెను. ఉన్నత విశాల వక్షము, బలిష్ఠ దీర్ఘ కాయము, ప్రసన్న గంభీరనయనములు, వీర తేజో విభాసితముఖ మండలముగల మిహిరభోజుని జూచి కుంతల క్షాత్ర తేజము, పౌరుషము, సౌజన్యము తన యెదుట మూర్తీభవించిన ట్లెంచెను.

ఆతనిపౌరుష మహిమచే నామె తరుణీ హృదయములోని దార్ఢ్యము పరాభూతమై సడలిపోయెను. ఒక్కసారె యామె యతనివంక జూచి తలవంచుకొనెను. పుష్పకోమలములైన యామె కపోలములపై ఉషఃకాలారుణశోభ లలముకొనెను.

మిహిరభోజు డొకింతసేపు నిశ్చలముగా ముగ్ధదృష్టితో కుంతల వంక చూచుచు నిలుచుండెను. పిదప నతడు స్నిగ్ధ కోమల గంభీర స్వరముతో, "కోసలరాజకుమారీ!" అని పిలిచెను.

ఆ స్నిగ్ధస్వరములోని గంభీరతా మాధుర్యము కుంతల హృదయాంతరమున మనోహరముగా ధ్వనించినది. ఆమె సంకల్పద్రఢిమ శిథిలమై పోయినది. చేతులు మెలిపెట్టు

కొనుచు, అధరము కొరుకు కొనుచు నామె తన మనో
దౌర్బల్యము తొలగించుకొన ప్రయాసపడ సాగినది.

మిహిరభోజుడు మరల, "రాజకుమారీ! తమ ఆదేశ మేమి? ఈ దాసు నెందులకు స్మరించినారు?" అనివచించెను

ఇదియేమి? విజయి యగు ప్రభుని ఈ ప్రవర్తన మేమి? ఇది కులీన సహృదయుని యౌదార్యమా, కాక అధీనురా లైన యబల యెడ క్రూరుడైన యనార్యుని తిరస్కారమా? కుంతల చలితయై మరల నొక్కసారి మిహిరభోజునివంక చూచెను. కాదు-కాదు. స్నిగ్ధోజ్జ్వలమైన ఆముఖశ్రీయందు, ప్రసన్నమధురములైన ఆనయనములందు క్రూరమైన-అనార్యమైన తిరస్కార ముండుట యసంభవము! కాదు-కాదు. ఏది ఎట్లైనను కాన్యకుబ్జరాజు సహృదయుడు, కులీనుడు, సుశీలుడు, మాన్యుడు, కాన్యకుబ్జ సింహాసనమున కెంతయు యోగ్యుడు. శ్రీహర్షదేవుని రాజసింహాసన మితనిచే కలంకితము కాలేదు.

మిహిరభోజుడు మరల నిట్లనెను: "రాజకుమారీ! ఈ దాసుడు తిరస్కరించుటకు గూడ యోగ్యుడు కా డని యోచించుచున్నారా? వీనియం దంత విరక్తి కలిగినదా? తమ జనకుని సమ్మతి లేకుండ తమ్ము స్వాధీనము చేసికొన్న మాట వాస్తవము. కాని సాధ్యమైనంతవరకు తమ్ము మర్యాదతో పూజింప గోరుచున్నాను."

ఈ వాక్యముతో అవసన్న ప్రాయమైన కుంతల చిత్తస్థైర్యము తిరిగి మేలుకొన్నది. ఆమె యతనికి నమస్కరించి

స్థిరస్వరముతో నిల్చి పలికినది: "కాన్యకుబ్జమహారాజా! క్షమింపుడు! అబలను, సహజముగా దుర్బలచిత్తను! ఈ యవస్థలో నేను తమ యెదుట పడవలసివచ్చినది. అందుచేత చిత్తస్థైర్యము కోసము ఎక్కువ ప్రయాస పడుచున్నాను. అందువలన కలిగిన అవినయమును క్షమింప వేడుచున్నాను. ఇది తమ గృహము. అదిగో పీఠము. అందుపవిష్టులై నన్ను కృతార్థురాలిని జేయగోరుచున్నాను."

మిహిరభోజుడు: "తమ ఆజ్ఞ శిరోధార్యము" అని పలుకుచు ముందరికి వచ్చి పీఠముపై నుపవిష్టుడయ్యెను. అయి, "రాజకుమారీ! తమరు నిలబడియుండుట అంత శోభగా లేదు. తమరు గూడ కూర్చుండుడు" అని వచించెను.

కుం: మహారాజుల సమ్ముఖమున కూర్చుండి ఆత్మనివేదనము చేసికొనుట అంత ఉచితము కాదు. తమ యాజ్ఞయైన యెడల ఇచటనే నిలుచుండి నా విషయము మనవి చేసికొందును.

మి: మంచిది. తమ ఇష్టమెట్లో అట్లే చేయుడు. ఇక ఈ దాసున కేమి యాజ్ఞ?

కుం: తమరు ప్రభువులు. దాసుడనని చెప్పుకొనుచు ఈ దాసి నెందుల కవమానించెదరు?

మి: కోసలరాజకుమారి నవమానించునంతటి స్వార్థహీనుడైన ఈ మిహిరభోజునకు లేదు.

కుం: ఆ కోసలరాజకుమారినే గదా మిహిరభోజులు పణముగా విక్రయము పొందినారు.

మి: రాజకుమారీ! తమను నాకు ధర్మపత్నిగా నుండుటకే తమ జనకుల కడకు ప్రార్థన మంపితిని. ఆయన నా ప్రార్థనము సఫలము చేయకపోవుటచే యుద్ధము చేయక తప్పినది కాదు.

కుం: మహారాజా! తన కన్యను తన ఇష్టము వచ్చినవారి హస్తములందు సమర్పించుటకు తండ్రికి స్వాతంత్ర్యమే లేదా? తండ్రి స్వేచ్ఛగా కన్యాదానము చేయలేదని ప్రార్థయిత కన్యను బలవంతముగా తీసికొని పోవచ్చునా? దుర్బలుని మీద బలవంతునకే ధర్మ మిట్టి యధికార మిచ్చెనో తెలియలేదు.

మి: (మందహాసముతో) రాజకుమారీ! భగవంతుడు శ్రీకృష్ణుడు రుక్మిణీ హరణమం దే క్షాత్రధర్మ మవలంబించెనో యదియే. క్షత్రియ సదాచారమును రాజ నీతియు బహుకాలము క్రిందటనే బలవంతునకట్టి యధికార మొసగి యున్నవి. ఆ యధికారము తోడనే బలవంతుడు బాహుబలముచే కాంక్షించిన ధనము సంపాదించుకొనుట కవకాశము గలుగుచున్నది.

కుం: మహారాజా! నిర్జీవములైన ధనరాజ్యములును తరుణియు నొక్కటి కాదు.

మి: ధనము నిర్జీవమైనను రాజ్యము నిర్జీవవస్తువు కాదు. ప్రజలమీది ప్రభుత్వమే రాజ్యము, ఆ ప్రభుత్వమునే విజయియగు రాజు విజితుని హస్తములనుండి బలాత్కారముగా లాగికొనును.

కుం; లాగికొనవచ్చును, కాని అనురక్తులగు ప్రజలు తమ రాజును శ్రద్ధాభక్తులతో నాదరింతురు. విజయి ప్రభుత్వము లాగికొన్నట్లు ఆదరము లాగికొనలేదు.

మి: విజయి గర్వింపక ప్రజల గౌరవము పాటించుటకు ప్రియత్నించు నేని అట్టి యాదరము పొందలేడా, రాజకుమారీ!

కుం: పరాజయము వలన కలిగిన యవమానము సహజముగా విస్మృతము కాదు.

మి: ఎవరి పరాజయము, రాజకుమారీ ! పరాజయము రాజునకా, ప్రిజలకా?

కుం: రాజునకే అయినను ప్రిజలకు గూడ. ప్రిజలు లేనిది రాజున కవకాశ మెక్కడిది? ప్రిజాశక్తిచేతనే రాజు శక్తిమంతు డగును. ప్రిజలు గౌరవించినపుడే రాజు గౌరవాన్వితుడగును. కనుక రాజపరాజయము ప్రిజాపరాజయమే యగును.

మిహిరభోజుడు కుంతల ముఖభంగి పరిశీలించుచు కొంచెము సేపు మౌనముగానుండి పిదప నిట్లనెను!"రాజకుమారీ, తండ్రికి గలిగిన పరాజయావమానమునకు తమరు కూడ బాధపడు చున్నారా!"

కుం: తండ్రి యవమానమునకు బాధపడని సంతానము కుసంతానము! అట్టి సంతాన మెవరి విషయములో గూడ తన కర్తవ్యము నెరవేర్చుకొనలేదు.

మిహిరభోజుడు నిర్నిమేష నయనములతో కుంతలవంక చూడసాగెను. ఆమె వాక్యములోని వ్యంగ్యాభిప్రాయము గ్రిహించినంతనే అతని నేత్రాంచలములందు ప్రిశంసారూపమగు సానంద ముద్భాసిత మయ్యెను. తదూర్వమగు మందహాసము కూడ నతని యధరప్రాంతమున ప్రిస్ఫుటిం

చెను. అంత నతడు "రాజకుమారీ! తమ జనకుల పణము ప్రతిగ్రహింప గోరుచున్నారా" అని యడిగెను.

కుం: లేదు. జనకుల యవమానమువల్ల నాకెంత బాధగా నున్నను, వా రేపణమునకు బద్ధులైనారో దానిని వారి బిడ్డ నగు నేను పాలింప బాధ్యురాలను. అది నాధర్మము.

మి: నా మహిషీపదము గ్రహించుటకు రాజకుమారి యంగీరించునా!

కుం: మహారాజా! జనకుల రాజ్యమునకు వినిమయముగా తమ రీ దీనురాలి దేహముపై నధికారము కోరినారు. జనకులు నిరుపాయులై కోరిన రీతి నన్నిచటికి పంపినారు. నాయీ హీనదేహము దేవరవారి చరణ సన్నిధియందు సమర్పించి యైనను ఆ పణము పాలింతును. తమ ఇచ్ఛానుసారము మహిషి యను పేరుతో గాని దాసియను పేరుతో గాని నన్ను తమ గృహమున నుంచుకొనుడు. శుల్కక్రీత యైన యబలను నేను అందుచే నా కే పేరు పెట్టినను ఒక్కటే!

మి: రాజకుమారీ! తమ వాక్యములు నాకు లజ్జాకరముగా నున్నవి-చాల బాధగా కూడ నున్నవి. తమరు చాల సౌందర్యవతులే! తమ నిదివరకు చూచియుండ లేదు. నాకు తమ రూపము ననుభవింపవలె ననులాలస ఏమాత్రము లేదు. ఇప్పటికిని నా నేత్రములు తమ సౌందర్యమునకు ముగ్ధము లగుచున్న మాట వాస్తవమే! కాని మనోనిరోధముచే, ధర్మశ్రద్ధచే నవి తమ సముఖమున క్రిందికి వ్రాలుచున్నవి. తుచ్ఛమైన ఇంద్రియలాలస ఆ ధర్మశ్రద్ధను

స్పృశింప లేదు. సామాజికము రాజకీయము నగు ప్రయోజనముకొరకు గురుదేవుల యాదేశముచే తమ్ము ధర్మపత్నిగా ప్రార్థించితిని. తమ జనకులు నా ప్రార్థనము సఫలము చేయలేదు. సామాజిక ధర్మానురోధముచే, రాజకీయ గౌరవానురోధముచే యుద్ధము చేయవలసిన బాధ్యత కలిగినది. యుద్ధమందు శుల్కముగా తమ్ము స్వాధీనము చేసికొన్నాను. కాని తమ్ము గాని తమ జనకులను గాని లాఘవపరచి అవమానింపవలె నని ఉద్దేశించి యుండలేదు. ఇప్పుడు తమ్ము నా రాజసింహాసనమున కర్థభాగినిగా, నా రాజగృహమందు పట్టమహిషిగా వరించుచున్నాను. రాష్ట్రీయకలహము వలని యనివార్య సంఘటనమువల్ల తమ కొకింత యవమానము కలిగియుండవచ్చును. దానిని క్షమించి తమరు నాప్రార్థన మంగీకరింపరా!

కుం: మహారాజా! అశక్తులకడ క్షమాక్షమలు నిరర్థకములు! ఇక మిగిలినదాని కీవరకే సమాధానము మనవిచేసికొన్నాను. నేను నా జనకుల పణమునకు బద్ధురాలను. తమ రెట్లాజ్ఞాపించిన నట్లు ప్రవర్తింతును.

మి: పణమునకు బద్ధురాలవా! రాజకుమారీ! కుంతలా! ఇక పణము సంగతి మరచిపోవీలు లేదా?

ఆకస్మికముగా పలికిన మిహిరభోజుని యుద్వేగ పూరితములైన వాక్యములు వినగానే కుంతల చకితయై యతనివంక చూచెను. ఆతని నేత్రములం దేదియో నూతనజ్యోతి, ఏదియో నూతనాకాంక్ష, ఏదియో నూతన వేదన ప్రకటితమగుచుండెను. అతని వీక్షణముల తీవ్రజ్యోతి కుంతలా

నయనములకు మర్మస్పర్శ కలిగించెను వెంటనే యామె కనులు క్రిందికి వ్రాలెను. ఆమె గండస్థలముల నుండి రక్తిమ యుద్గమించెను.

మి: ఏమందువు కుంతలా దేవీ! మరచిపో జాలవా!

కుం: (కంపితస్వరముతో) దేనికి జన్మకారణమై తమ సమ్ముఖమునం దుంటినో దాని నెట్లు మరువగలను?

మి: సంఘటనమును గాదు, దాని నెవ్వరు మరచిపో లేరు. దాని వేదన మరచి పోజాలవా?

కుం: (ఈషత్కంపిత మృదుస్వరముతో) మహారాజా! ఈ నా వేదన పితరుల వేదనకు ప్రతిధ్వని, ధ్వని ఆగిపోవనిది ప్రతిధ్వని యెప్పుడు నాగిపోదు.

మి: అట్లయిన ఇప్పు డేమి చేయగోరుచున్నారు.

కుం: తమ రెట్లాజ్ఞాపించిన నట్లు చేయుదును.

మి: స్వేచ్ఛగా-సంతోషముతో నన్ను వరింపు డని ఆజ్ఞాపించినచో!

కుం: మహారాజా! ఈ దేహము మీదను, దైహిక కృత్యముల మీదను ప్రభువులకు ప్రభుత్వము కలదు. కాని హృదయము ఏ ప్రభు నాదేశమునకును వశవర్తి కాజాలదు.

మి: సంతోషముతో నన్ను భర్తగా వరింప జాలరా, కుంతలా దేవీ!

మిహిరభోజుని కంఠస్వరము కంపించెను. కుంతల అతికష్టముతో చిత్తము స్థిరపరచుకొని, "పితరులు నన్ను స్వేచ్ఛగా

తమ హస్తములందు సమర్పించినచో — అప్పుడు — అప్పుడు వరింపగల ననుకొందును” అని పలికెను.

మి: తమ జనకు లట్లు చేయుదురా ?

కుం: చేయరు. అందులో నిట్టి యవమానము జరిగిన తరువాత చేయరు.

మి: (ఇంచుక సేపు ఊరకుండి) కుంతలా! మొట్టమొదట నే యుద్దేశముతో తమ పాణిగ్రహణ మభ్యర్థించితినో దాని నింకొక చోట సఫలము చేసికొనగలను. కాని నేడు — పోనిండు! ఇక నావిషయ మెత్తదలచుకొన లేదు. సంతోషముతో నన్ను వరింప లేనప్పుడు తమ్ము మహిషీత్వపాశముతో బంధించి యుంచుకొన గోరను.

కుంతల ముఖమెత్తి ఒక్కసారి మిహిరభోజుని వంక చూచి తల వంచుకొనెను. పిదప మృదుస్వరముతో, “మహారాజా! రాజ్యమునకు వినిమయముగా తమ యాదేశ ప్రకారమే నా జనకులు నన్ను తమ సన్నిధికి పంపినారు. ఇపుడా సంధిశుల్కమును తిరిగి పంపివేయుదురా? మహాప్రభూ! ఈ యబలను క్షమింపుడు! నేను పలికిన పలుకు లన్నియు నుపసంహరించుకొనుచున్నాను” అని నివేదించెను.

మిహిరభోజుని విషణ్ణవదనమున మ్లానమైన మందహాస మంకురించెను. అర్థనిమీలిత నేత్రములతో నత డామె వంక చూచుచు, “కుంతలా! సంధిశుల్కమైనంత మాత్రమున తమ్ము నేను అవమానింపలేను. పణముతో నిమిత్తము లేకుండగనే మీజనకుల రాజ్యము వదలి పోయెదను. నే నాయన

రాజ్య మభిలషింప లేదు. తమ్ము మాత్రమే అభిలషించితిని, అభిలషితార్థము పొందలేనప్పుడు ఉదుత రాజ్యమువల్ల నా కేమి సుఖము!" అని పలికెను.

కుంతల నేత్రములు బాష్పాక్రాంతము లయ్యెను. అతని మహౌదార్యమున కామె ప్రాణములు విహ్వలించిపోయెను. భక్తిభావముతో నతని చరణములపైబడి దొరల బుద్ధి పుట్టెను. "అహా! ఇత డింత మహోదారు డని, ఇట్టి మహావీరు డని, ఇంత మహాత్మ్య సంపన్ను డని తెలిసినచో నా జనకు లితనికి స్వేచ్ఛగా కన్యాదానము చేసియుండరా! కాని ఫలితము లేదుగదా! పోనిమ్ము మహోదాత్త చిత్తముకన్న ఫలితము అంత గొప్పదియా!" అని భావించెను.

మిహిరభోజుడు లేచి, "కుంతలా! ఇక సెలవు తీసికొనె దను. నేడు తమ్ము తమ జనకుల వద్దకు పంపి నేను కోసల రాజ్యము వదలి పోయెదను. ఈ దీనుని ఎప్పుడైన స్మరిం పుడు!" అని వచించెను.

కు: మహారాజా! నేడు తమరు తమ మహాత్మ్యముచే ఈ దాసి హృదయము శాశ్వతముగా కొని వేసినారు. అవమా నితులైన జనకుల వేదన వదలలేకున్నాను.

మి: వదలుకొను డని నేను కూడ చెప్పలేకున్నాను.

కుంతల నయనముల నుండి యశ్రుజలము ప్రవహింప సాగెను. నతశిరస్కయై ఆమె అట్లే కొంతసేపు నిలుచుండి, పిదప మృదుకంపిత స్వరముతో, "భవిష్యత్తులో నాభాగ్య మెట్లున్నదో తెలియదు. జనకులు ప్రసన్నులైరేని మరల తమ దర్శనము చేసికొందును" అని విన్నవించెను.

మి: నేనును అట్టి యాసతో జీవనము గడిపెదను. ఇక సెలవా, కుంతలా!

కుం: ఈ దాసి ప్రణామము గ్రహింపుడు.

మి: ఆశీర్వదించుటకు నా కధికార మున్నదో లేదో తెలియదు. అయినను తమరు ప్రణామము చేసినప్పుడు నే నాశీర్వదించెదను: తమ వాంఛితము సఫలమై సుఖపడుడు!

మిహిరభోజు డిట్లు పలుకుచుండ నతని వదనమున మధుర మందహాసము ప్రస్ఫుటించెను. అట్టి మధుర మందహాసము తోడనే, కుంతల, "ఇంతకన్న గొప్ప ఆశీస్సు నిక నేదియు కోరుకొనను" అని పలికెను.

5

నారాయణదేవుడు: మహారాజా! కోసలేశ్వరా! జయంతదేవా!

జయంతదేవుడు: ఆ! అట్లు పిలువుడు! ఆ పేరుతోనే నన్ను పిలువుడు! లోకములో నందరి తల్లిదండ్రులతో పాటు నా తల్లిదండ్రులు గూడ నాకు నామకరణము చేసినారు. ఆ నామముతోనే నన్ను పిలువుడు. నే నిపుడు మహారాజును కాను, కోసలేశ్వరుడను కాను, సామాన్య మానవులతో పాటు నేను నొక మానవుడను. ఒకరినుండి యొకరి విశిష్టత తెలియుట కొక నామ ముండుట యవసరము. దాని ప్రయోజన మదియే! అందుచేత నా పేరు కూడ జయంతదేవుడు. అంత కన్న నెక్కువగా నే నెవ్వడను కాను, నారాయణదేవా!

నా: ఇట్టి పలుకులతో నీ యధీను నెందులకు బాధించె దవు, మహారాజా!

జ: మరల మహారా జందు రేమి! కాదు-కాదు. ఎందులకు నన్న వమానించెదరు? మీ పేరు నారాయణదేవుడు. నా పేరు జయంతదేవుడు. మన మిరువురము మానవ సామాన్యులము. ఇరువురము సోదర సమానులము. ఇంకను మీరు వయోవర్ణనులలో నాకన్న జ్యేష్ఠులు. అందుచేత నాకు సన్మాన్యులు! అధీనులా, ఆర్యా! ఎవరి యధీనులు మీరు?

నా: వయోవర్ణములలో శ్రేష్ఠుడ నని మహారాజు లీదీను నాదరించినారు. కనుక నేను కోసలేశ్వరుల సేవకుడను. అందుచే యథార్థముగా నేను వారి యధీనుడనే!

జ: (మందహాసముతో) నిజము! మీరు కోసలేశ్వరుల సేవకులు. అందుచే వారి యధీను లనుట యథార్థమే! అయినను నేనిక కోసలేశ్వరుడను కాను, నారాయణదేవా!

నా: కోసలప్రజ లందరు దేవర నే కోసలాధిపతిగా సన్మానించు చున్నారు. తమరు రాజ్యము త్యజించి వచ్చినారు. కాని వారు తమత్యాగ మిప్పటికిని గ్రహింప లేదు.

జ: గ్రహింప లేదా! అయ్యో! రాజవంశమున జన్మించినందులకు నాకింత దౌర్భాగ్యమా! ఈ రాజత్వ దాస్యము నుండి విముక్తుడను కాజాలనా!

నా: రాజత్వము దాస్యమా, మహారాజా! క్షమింపుడు-నాకంఠమునం దూపిరి యున్నంతవరకు-నాకు శబ్దోచ్చారణ శక్తి యున్నంతవరకు తమ్ము మహారాజా అనియే సంబోధించుచుందును. ఏమి సెలవిచ్చినారు? రాజత్వము దాస్య

మనియా? ప్రజలకు ప్రభువు దాసు డగునా? ఎవరికి దాసుడు, మహారాజా!

జ: ప్రజలకే, నారాయణదేవా! రాజు ప్రజలకు ప్రభువు కాడు- కేవలము దాసుడే! ప్రజల రంజించు వాడగుటచే ప్రభువు రాజశబ్దవాచ్యుడగుచున్నాడు. ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని రాజు ప్రజాభిప్రాయానుసారముగా రాజ్యము పరిపాలింపవలెను. ప్రజ లసంతుష్టులైనపు డా రాజు గాని యతని వంశీయులు గాని దీర్ఘకాల మా రాజ్యము - ఆ ప్రజాధి పత్యము నిలుపుకొనగలరా? ఒక వేళ నిలుపుకొన కలిగినను అది కేవలము సైనికబలము చేతనే. కాని ఆ సైన్య మెవరు? ప్రజలే గదా! ప్రజల యసంతుష్టి సైనికులందుగూడ ప్రవేశించునేని ఆ బల మా రాజున కెంతకాల ముండును?

నా: ప్రజల యిష్టానుసారము వారికి సంతుష్టి కలుగునట్లు రాజ్యము పాలించుట రాజధర్మము. ఆ మాట సత్యమే. అపుడే రాజ నామ మన్వర్థ మగును. కాని అప్పుడును అతడు ప్రభువే! అనురక్తులైన ప్రజలసంతుష్టియే అతని ప్రభుత్వము.

జ: ఆ ప్రభుత్వమే రాజునకు దాస్యము. కోసలములోని సామాన్య జనులకు గల స్వాతంత్ర్యము నాకెప్పుడైన నుండునా? సామాన్యు డెవ్వని లక్ష్యపెట్టవలసిన యవసరము లేదు. తన యిష్టానుసారము తన జీవయాత్రలోని పని పాటలు చేసికొనగలడు. తనకు కష్టనిష్ఠురములు మానావ మానములు ఎందుకు కలుగుచున్నవో స్వయముగా విచా రించుకొని తొలగించు కొన గలడు. కాని రాజు ప్రతిదినము

ప్రతి కార్యమందును ప్రతి పదక్షేపమందును కఠిననియమము లకు బద్ధుడై ప్రవర్తింపవలసి యున్నది. సకల ప్రదేశములందును సకలావస్థలందును రాజు యంత్రమువలె నడువ వలసి యున్నది. ప్రజాసంతుష్టి కన్న నిజసంతుష్టి సాధించుకొనుట కేది యవసరమో అది ఎంతమంది రాజులకు కలదు. నారాయణదేవా!

నా: సంపూర్ణ స్వాతంత్ర్య మొక్క సన్యాసికి మాత్రమే కలదు. సంసారికి లేదు. సంసారి యనేక నియమముల కధీనుడై సంసార సంతుష్టికి తన సంతుష్టిని బలిచేయవలెను. ప్రజలందురు రాజునకు సంసారము. అందుచేత సామాన్య సంసారికన్న రాజు అధికముగా నియమబద్ధుడు కావలసి యున్నది.

జ: ఆర్యా! అందుచేతనే రాజదాస్యము ప్రజాదాస్యము కన్న నెక్కువ దని చెప్పుచున్నాను. ఈదాస్య మిప్పుడు నా కెక్కువ బాధ కలిగించినది. నాహృదయమును ఛిన్నభిన్నము చేసివేసినది. నా మానవధర్మమును నా మర్యాదను నట్టేట ముంచివేసినది. ఇక నీ దాస్యభారము నేను వహింపలేను. సామాన్య మానవునకు తన సంతానముపై గల యధికారము కూడ నాకు లేకుండ జేసి యీ రాజత్వదాస్యము నన్ను వంచించినది. దానిని నే నెట్లు సహింపగలనో చెప్పుడు! మానవు డెప్పుడైన నీ యధికారమునకు వంచితుడై యిట్టి యవమానము నెప్పుడైన సహింపజాలెనా!

నా: (ధీరభావముతో) రాజునకు బాధ్యత గొప్పది. సంసారము కూడ గొప్పది. దాని యభ్యుదయముకోసము

చేయవలసిన త్యాగము కూడ చాల గొప్పది. మహారాజులు మరచినారేమో! తమ పూర్వ పురుషుడు భగవంతుడు శ్రీరామచంద్రుడు ప్రజాసంతుష్టికోసము సాక్షాల్లక్ష్మీ స్వరూపిణి యగు సీతాదేవిని పరిత్యజించినాడు.

జ: వాస్తవమే. స్వేచ్ఛతో త్యజించినాడు. కాని బాధ్యుడై కాదు. ప్రజాబృందము రౌద్రమూర్తి ధరించి మీ పట్టమహిషి నరణ్యములకు పంపివేయుడని చెప్పినప్పుడు వారియాజ్ఞకు బద్ధుడై తన కిష్టము లేకున్నను శ్రీరామచంద్రుడు సీతాదేవిని త్యజించి యుండిన యెడల ఆయన నామము పూజ్యభావముతో నేటివరకు స్మరించుచుందురా! మీరే చెప్పుడు, నారాయణదేవా!

నారాయణదేవుడు నతముఖుడై యించుకసేపు నిశ్శబ్దముగా నుండి పిమ్మట ఆర్ద్రనయనములతో నిట్లనెను. "మహారాజా! రాజ్యక్షేమము కోసము-ప్రబలుడైన పరరాజు పరిగొనినప్పుడు పరాధీనతా పాశమునకు బదులు కాకుండుట కోసము భీతులైన కోసలప్రజ లిట్టి బాధ్యలకు లోనైనారు.

జ: వారి బాధ్యత నేను వహించినాను. వారికి అమంగళము కలిగింపలేదు. వారు పరాధీనతా పాశమునకు బద్ధులు కాలేదు. అయినను ఏ జనకుడు తన కన్యను పణముగా విక్రయించుటకు బాధ్యుడైనాడో అతడు రాజుగా నుండి ప్రజలను శాసించుటకు గాని రక్షించుటకు గాని అయోగ్యుడు. అందుకోసము రాజ్యము త్యజించి సమీపమందున్న యీ పర్వతప్రాంతమున ఆశ్రమ మేర్పరచుకొన్నాను.

కేవల మొక్క రాజ్యమునే కాదు, నేను సంసారమును గూడ త్యజించితిని. కారణము - సంసారికి తన సంసార మందెట్టి స్వాతంత్ర్యము కలదో దానిని గూడ యజమానుడనైన నేను కోలుపోయినాను

నా: నిరుపాయులు కోసలవాసులు కఠోరమైన యీ బాధ్యతాగ్నికి తమ్ము గురిచేసినారు. కాని నేడు వారు చాల పశ్చాత్తాపతప్తులగుచున్నారు. కోసలరాజ్య సింహాసనమున తామే ఉండవలెనని వారు కోరుచున్నారు.

జ: ఆ పవిత్ర సింహాసనము నే నిక కలంకితము చేయజాలను. నేను అయోగ్యుడను- కేవల మయోగ్యుడను. క్షమింప వేడుచున్నా నని వారితో చెప్పుడు. కోసలము నా జన్మభూమి. అందుచే నేను కోసలమును విడిచిపోను. కోసల సంతానములో నొకడనై కోసల కల్యాణము కోసము శక్తి వంచన లేకుండ ప్రయత్నించుచు జీవనము గడపెదను. నా పత్ని మాత్రేయి నా కడ నుండును. ఆమె నా అర్ధాంగి. ఎట్టి యవస్థయం దైనను నాకు సహధర్మిణి. అందుచే నామెను త్యజించుటకు వీలు లేదు. నా కుమారులు కుమారికలు ఉన్నారు. వారికి సంసారత్యాగి మృతప్రాయుడు. నేను లేనప్పుడు నాస్థానము నా జ్యేష్ఠపుత్రుడు సువర్ణుడు వారి కాశ్రయుడగును. నా సంసార మంతయు నిప్పు డతనిది. ఇష్ట మగునేని ప్రజ లతనిని రాజపదమం దభిషిక్తుని చేసికొన వచ్చును. గురుతరమైన ఈ రాజ్యబాధ్యత కతడుత్తరాధికారి కావలెనని నేను కోరను. అతడేమనుకొనుచున్నాడో తెలియదు. ఈ రాజ్యము నే నార్జించినది కాదు. వంశపారంపర్య

మున వచ్చినది. అందు నాకు లభించిన పదవికి నేను లేనపుడు అత డధికారి యగును. ఆ యధికారము గూడ ప్రజ లంగీకరించినపుడే! అతడు దేనిని కోరునో, అతనివల్ల ప్రజ లేమి కోరుదురో చెప్పలేను. ఇక మీరు వెళ్లిపొండు.

నా: (సాశ్రునయనములతో) మహారాజా! అట్లయిన తేమరు కృతనిశ్చయు లైనట్లే తలప నగునా?

జ: నిశ్చయముగా, ఆర్యా! మీరు దుఃఖపడవద్దు. మీ కన్నీటిచే నన్ను దుర్బలుని చేయవద్దు. నే నయోగ్యుడను. కాని సుదర్శనుడు యోగ్యుడగునేమో యెవరు చెప్పగలరు. ఎచట నున్నను ఎట్టి భావముతో నున్నను నేను మీవాడ నే!

నా: మహారాజా! అమాత్యవర్గము నాగరకముఖ్యులు జానపద ప్రధానులు వచ్చియున్నారు. ఇంచుక దూరములో తమకోసము వేచియున్నారు. మహారాజు లొక్కసారి వారికి దర్శన మిత్తురా?

జ: ఏమి ప్రయోజనము, నారాయణదేవా! అందువల్ల కేవలము మనోవ్యథయే కలుగ గలదు.

నా: అనుగ్రహముంచి మహారాజు లీమనోవ్యథ నంగీకరింపవలెను. కాకున్న వారు వ్యథాకులితహృదయులై తిరిగి పోయెదరు. ఒకవేళ శాశ్వతవియోగమే స్థిరపడునేని అట్టి సమయమున వారిని దీవించి కృతార్థుల జేయుడు. రాజకీయ విషయములం దీ వియోగ మనివార్యమైన దనియు, స్నేహ విషయమున వారినుండి విడిపోవుట లేదనియు వారికి నచ్చ జెప్పి పశ్చాత్తాప తప్తము లగు వారి హృదయముల కొంకింత శాంతి కలిగింపుడు.

జ: (ఆలోచించి దీర్ఘ నిశ్శ్వాసము విడిచి) అట్లే చేసెదను. ఆర్యా! మీరు సుందు వెళ్ళి నా విషయము వారికి తెలియజెప్పుడు. ఇప్పుడు నేను వచ్చుట కేవలము వియోగకాలమందలి యూరడింపు పలుకుల కోసమే సుమా! ఇతర ప్రసంగములు తెచ్చి నా హృదయమునకు మరెంత కలత కలిగింప వలదని చెప్పుడు. వారట్టి ప్రసంగములు చేసినను వృథా యగును. తెలిసినదా! వారికి గూడ తెలియజెప్పుడు. నా యీ సంకల్పమునకు తిరుగు లేదని నొక్కి చెప్పుడు.

7

జయంతదేవు డరుదెంచి వర్ణజ్యేష్ఠుల కభివాదనము చేసి. ఇతర సచివులను ప్రధానులను ధీరశాంతభావముతో నాశీర్వదించి యిట్లు పలికెను:.

మిత్రులారా! నా యయోగ్యతను తెలిసికొని నేను కోసల రాజ్యసింహాసనము త్యజించితిని. అందులకు మీరు చింతింపకుడు. అసంతుష్టులు కాకుడు. నే నెవడను! ఎంత వాడను! కోసలదేశపు మంగళామంగళములు నాపై నెంతవర కాధారపడి యున్నవి! కోసలరాజ్యము నేను సృష్టించినది కాదు. నాతో పాటు దానికి లోపము సంభవింపదు.

ఆదియుగమందు భగవంతు డగు వైవస్వతమనువు సంతానముగా నీ క్షత్రియవంశము ప్రతిష్ఠ గాంచినది. ఆ వంశధార అవిచ్ఛిన్నముగా నాటినుండి నేటివరకు కోసలరాజ శక్తి యందు ప్రవహించుచు వచ్చినది. వచ్చి వచ్చి యీ దీనుని

యుందు పడినది. కాని యీశ్వరానుగ్రహమువలన నాయం నది లుప్తము మాత్రము కాలేదు. నా దౌర్భాగ్యవశమున నెంత క్షీణించినను, ఎంత పంకిల మైనను, అది మాత్రము ప్రవహించుచునే యున్నది. ఈశ్వరానుగ్రహము వల్ల వేగ మున్నంతవరకు ప్రవహించును.

రాజశక్తి యీ ధారనే ఆశ్రయించి యుండవలె నని మీ రంద రామోదించిన యెడల నది యట్లే ప్రవహించును. యోగ్యు డైన వాని గుణవిశేషమునుబట్టి గౌరవవృద్ధినిగూడ పొందును. ప్రతి యుగమందు నిట్లే జరుగుచు వచ్చినది. ఇక ముందు కూడ నిట్లే జరుగును. ఒకానొకని శక్తిమీద రాజ్య మంగళా మంగళము లాధారపడి యుండవు. రాజస్థైర్యము వెల యిచ్చి కొనదగినది కూడ కాదు. కోసల యట్టి పని యిదివరకు చేసియుండలేదు. ఇక ముందు కూడ చేయదు.

పూర్వ యుగమున భగవంతుడు శ్రీరామచంద్రు డీ కోసలమున కధీశ్వరుడుగా నుండెను. ఆయన గతించి కొన్ని వేల యేం డ్లైనది. కాని ఆయన కోసలము మాత్రము నేటికిని నిలిచియున్నది. ఇకముందు గూడ నీ కోసల మొకానొకని విశేషత్వముమీద నాధారపడి యుండక ప్రళయకాలము వరకు జీవించి యుండుటకై ఈశ్వరుని ప్రార్థించు చున్నాను. ఎంత కాలము మీ రంద రాశక్తికి భిత్తికలై రక్షించుచుం దురో అంతవర కది నిలిచి యుండును. మీ పూర్వ పురుషు లంద రట్లే చేసినారు. అందుచేతనే రాజు దుర్బలు డైనను, ప్రబలు డైనను మరి యెట్టి వా డైనను తదపేక్ష లేకుండగనే కోసలరాజ్య శ్రీ కోసలదేశమున నేటికిని జీవించియున్నది.

నే నెవ్వడను? విన్న ఉన్నాను. నేడు లేను, నే నున్నను రేపిక ఉండను. ఎంతకాలము మీరందరు శక్తిమంతులై యుందురో మీశక్తి యెవరి కాశ్రయ మిచ్చునో కోసలదేశప్రరాజశక్తియు రాజ్యశ్రీయు వానినే ఆశయించి యుండును. మీశక్తి ఎంత అధికముగా నున్న రాజశక్తి అంత దృఢముగా నుండును. రాజ్యశ్రీ అంత సముజ్జ్వలమగును. అట్టి దృఢశక్తిని ఉజ్జ్వలశ్రీని ధరింపగలవాడే రాజసింహాసనమున కర్హుడగును. నేను ధరింపలేక పోయినాను. అందుచే నా రాజసింహాసనము గ్రహింప గోరుటలేదు.

నా కుమారుడు సుదర్శను డుపయుక్తుడగు నని విశ్వసించుచున్నాను. కాకున్న అతడు కూడ సింహాసనము త్యజించుట యుచితము. భగవంతుడు శ్రీరామచంద్రుడు సింహాసనగౌరవము నిలబెట్టెను. ఇక యోగ్యుడైన వాడీ వంశమున లభింపడేని యోగ్యుడైన ఇతర రాజన్యుని సింహాసనమున ప్రతిష్ఠించి కొనుడు. యోగ్యతాహీను డెంత గొప్ప వంశస్థు డైనను ఉన్నతపదవి కదగాడు రాజాలడు.

అది యట్లుంచి, ఆరాజు యోగ్యుడీ రాజ యోగ్యుడని మీరిక విచారింపవలసిన యావశ్యకత లేదు. మీరు యోగ్యులుగా నున్న రాజు యోగ్యతలో నెట్టి లోపమున్నను నది పరిపూర్ణ మగును. అట్టి యోగ్యత మీయందే ఉండును గాక! ఆ యభిలాషతోనే త్రికరణ శుద్ధిగా నేను మీకడ సెలవు కోరుచున్నాను. కేవలము మీ రాజుగా మీకడ సెలవు తీసికొనుచున్నాను— కాని కోసలసంతానముగా మాత్రము కాదు. జీవించియున్నంతవరకు కోసలమందే యుం-

డెదను. నేను కోసల పుత్రుడను. మాతృదేశమునకు యథా శక్తి సేవ చేయుదును. సేవయం దెట్టి లోపము చేయను. ఇది వరకు మీకు రాజుగా నుంటిని, ప్రభువుగా రాజ్యము పాలించితిని. నేడు నేను కోసల సంతానరూపముగా మీకు భ్రాతృసమానుడను. మీకును నాకును గల సంబంధము మరింత సన్నిహిత మైన దని తెలిసికొనుడు. నేడు నేను సమస్తమైన రాజవిధిబంధనముల నుండి విముక్తుడ నైనను కేవల ప్రేమ బంధముచే మీ యెడ బద్ధుడను. నమస్కారము. నా యభివాదనము గ్రహింపుడు. మీ సకల సుఖ దుఃఖములలో సమస్త మంగళా మంగళములలో సమానభాగి యగు మీ సోదరునిగా నన్ను మనస్సులో నుంచుకొనుడు.''

నిశ్చలముగా నిశ్శబ్దముగా సచివాదు లందరు మహారాజు వినీత భావముతో పలికిన ఆత్మనివేదనము వినిరి. పదవీ ప్రతిష్ఠలం దౌన్నత్యము వహించినవాడు దైన్యము వెల్లడించినపు డది ప్రజాహృదయము స్పృశించినట్లు లోకములో నింకేదియు స్పృశింప దనుటకు సందేహము లేదు. అందరి నేత్రము లశ్రువులతో నిండిపోయెను.

కొంతసేపటికి కొక నాగరకముఖ్యు డిట్లు నివేదించెను: "మహారాజా! తమ సంకల్పము మార్చుటకోసము మే మెట్టి నిర్బంధము చేయరా దని తాము శాసించినట్లు తెలిసికొన్నాము. అందుచే నిర్బంధింపవలె నని మా హృదయములో నెంత యుత్కంఠ యున్నను దాని నణచుకొన వలసి వచ్చినది. అయినను ఒక్క విషయము మనవి

చేయుట కనుమతి దయచేయ ప్రార్థించుచున్నాను".

జ: ఏదియో చెప్పుడు.

నాగరకముఖ్యుడు: తమ రీ సంభాషణములో మాటి మాటికి యోగ్యుడను కానని నుడివియున్నారు. అది మా హృదయములకు మిక్కిలి వ్యథ కలిగించినది. ఎందులో తా మయోగ్యులు? కోసల దేశమునకు సుఖస్వరూపుల మగు మే మందరము దేవర చరణ సన్నిధి నిలిచియుండుట తమ యోగ్యతకు తార్కాణము కాదా? కోసల రాజదండము ధరించుటకు తామే యోగ్యులను మా విశ్వాసమున కిది ప్రబల ప్రమాణము కాదా? గొప్ప విపత్తు పాలై తమ హృదయమునకు తీవ్రబాధ కలిగించితిమి. తమచే చేయరాని కార్యము చేయించుటకు బాధ్యుల మైతిమి. అందుకోసము మిగుల పశ్చాత్తాప పడుచున్నాము. తమరే మాకు పాల కులు, తమరే మాకు ప్రభువులు, తమరే మాకు పితృ స్థానీయులు. పశ్చాత్తాప తప్తుల మగుచున్న మేము తమ బిడ్డలము. ప్రభుస్వాభావిక మగు కరుణతో, పాలకసహజ మగు మమతతో, పితృసహజ మగు వాత్సల్యముతో మా యీ యపరాధము క్షమింప వేడుచున్నాము.

జ: ఏమి? క్షమాపణయా! ఏమి క్షమింపవలెను? మీ రపరాధులని నే నెంతమాత్రము భావించుట లేదు. అయో గ్యుడ నగుటచే శత్రువు లాక్రమించినపుడు బాహుబలముచే నేను దేశము రక్షింపలేక పోయితిని. భ్రాంతుడనై కర్త వ్యము తెలిసికొన లేకపోయితిని. దానిని తెలిపి మీరు నాచే నిర్వర్తింపజేసితిరి. అందుకోసము మిమ్ము క్షమింపవలసిన

చేదియు లేదు. మీరే నన్ను క్షమింపవలెనని ప్రార్థించు
చున్నాను. హృదయదౌర్బల్యముచే మీరింతకు మనస్సం
క్షోభము నొందుచున్నారు. వలదు, వలదు! అనవరతముగా
దుఃఖముతో క్రుంగిపోవలదు. కఠినుడ నని, నిర్దయుడ నని
నన్ను తలప వలదు. సహజమైన శక్తి భావమే మీ హృద
యములలో నిలిచి పోవచ్చును. కఠినభావముతో నా హృద
యావస్థ మీకు తెలియజేసితిని. మానవ మాత్రు లందరికి
కొన్ని కొన్ని సాధారణ ధర్మములు ఉండును. అవి రాజున
కును ప్రజలకును భిన్నభిన్నములు కావు. వాని నెవడు రక్షిం
చుకొన లేడో వా డెవ్వడైనను మానవ గౌరవమున కధికారి
కాడు. బలవంతుడైన శత్రువునకు తన కన్యను పణముగా
విక్రయించుకొన వలసివచ్చిన రాజు మానవగౌరవము రక్షిం
చుకొన గలిగినవా డని చెప్పవచ్చునా? అకృత్యము చేయిం
చితిమి గదా యని మనసులో నొంచుకొనవద్దు. దేశసంరక్ష
ణార్థము మీరు మీ కర్తవ్యము నిర్వర్తించితిరి. దుర్బలు
డను అయోగ్యుడను కావుటచే నేను కర్తవ్యము పాలింప
లేకపోయితిని. నా హైన్యమును నా దౌర్బల్యమును తలచు
కొని లోలోపల కుమిలిపోవుచున్నాను. అయోగ్యుడైన
మానవుడు యోగ్యుడైన రాజు కాగలడా? సామాన్య
మానవధర్మము కన్న రాజధర్మపు బాధ్యత చాల గొప్పది.
క్షమింపుడు, దుఃఖింపకుడు, వలదు, వలదు! ఇక నీ గురుతర
బాధ్యత గ్రహింపజాలను. మీరు సహాయులుగా నున్న మీ
శక్తివలన నా కుమారు డాయుష్మంతుడు సుదర్శనుడు ఈ

దూరమునుండి, "రాజకుమారీ, రాజకుమారీ! కుంతల, కుంతలా! మహారాజునకు జయము, మహారాజునకు జయము!" అని కోలాహలము బయలుదేరెను. అత్యంత సంభ్రమాశ్చర్యములతో సందరు శిరము లెత్తి చూడ సాగిరి. ముందు వెనుకల అశ్వారక్షకులతో అశ్వారోహిణి యైన రాజకుమారి సభాసమీపమునకు వచ్చెను. అందరు నామెకు త్రోవ యిచ్చిరి. అశ్వము దిగి ధీరగమనముతో వచ్చి కుంతల పితృచరణములకు నమస్కరించి, "తండ్రీ! మహారాజా! తమ కుమారి నమస్కారము గ్రహింపుడు" అని వేడుకొనెను.

నిశ్చలభావముతో అశ్రుసిక్త నయనములతో జయంతదేవు డిట్లనెను: "కుమారి నమస్కారమా, మిహిరభోజుని మహిషి నమస్కారమా, తల్లీ!"

కుం: కుమారి నమస్కారమే! మిహిరభోజునకు నే నెవ్వతను కాను, తండ్రీ!

జ: మిహిరభోజునకు నీ వెవ్వతవు, కావా! శుల్కక్రీతయైన దాసిగా గదా వెళ్ళియుంటివి! నిన్నతను కరుణించి వివాహము చేసికొనలేదా?

కుం: లేదు శుల్కక్రీతయైన దాసి నతను వివాహమాడడు. ఆత్మసమర్పణము చేసికొనుటకు గూడ సిద్ధపడితిని కాని అట్లు గ్రహించుట కతఁ డంగీకరింప లేదు. అందుచే నాకు ముక్తి నొసగినాడు.

జ: ముక్తి నొసగినాడా! పణము వదలుకొని ముక్తి నొసగినాడా!

కుం: అగును.

జ: ఎందుచేత ?

కుం: చెప్పితిని గదా దాసిగా నన్నతడు కోరుట లేదని.

జ: అట్లయిన నెందుకు విక్రయించుకొన్నాడు?

కుం: శుల్కక్రీత నైనను సంతోషముతో నతని మహిషీపద గౌరవ మంగీకరింతు నని తలచి యుండవచ్చును.

జ: మరి నీ వంగీకరింపలేదా?

కుం: లేదు. తమ కుమారి దాని నంగీకరింప లేకపోయినది. తమపణము పాలించితిని, దాసీరూపమున నాత్మసమర్పణము చేయుటకు గూడ నంగీకరించితిని. అతడు తమ కుమారిని ధర్మపత్నిగా కోరెనే గాని దాసిగా కోరుకొనలేదు. దాసినైన నేను మహిషీత్వ మంగీకరింప లేదు. అందుచే నాకు దాస్యవిముక్తి యొసగి, మరల తమ హస్తములందు ప్రత్యర్పణము చేసినాడు.

జ: ధన్యురాలవు, తల్లీ! కోసలమునకు యోగ్యమైన రాజ కుమారివి! అంతకన్న ధన్యుడా మిహిరభోజుడు! అనార్యుడైనను శ్లాఘ్యమైన ఆర్యమహత్వము ప్రకటించినాడు.

అపుడు మంత్రి నారాయణ దేవు డిట్లనెను: "ఆర్యు డెవడు, అనార్యు డెవడు, మహారాజా? ఎవడు ఉదాత్త స్వభావుడో వాడే ఆర్యుడు. ఎవడు నీచస్వభావుడో వా డనార్యుడు".

జయంత దేవుడు తిరిగి చూచి యిట్లు పలికెను: "అగును, నారాయణదేవా! ఆర్యత్వమునకు స్వభావమహత్వమే విశిష్ట

లక్షణము. కాని ఆర్యానార్యభేదము స్వభావభేదము ననుస
రించి కాదు. శోణిత భేదము ననుసరించి. ఉదాత్తస్వభావు
డగు అనార్యుడు సర్వదా ఆర్యుడ కాజాలడు. అయినను
ఆర్యానార్యుల శోణిత సమ్మేళనము — వలదు, నారాయణ
దేవా! ఆ విషయము గొప్ప శాస్త్రీయ సమస్య. అది అంత
సులభముగా నిర్ణయించుటకు వీలులేదు తెలిసినారాంశమే
మన కులీనులగు ఆర్యులకు పరంపరాగతమైన సంప్రదాయ
మిందుకు విరుద్ధమైనది."

అంచుకు అప్రతిభుడై నారాయణదేవుడు మరల నిట్ల
నెను: "మహారాజా! శోణిత సమ్మేళనమును గురించి శాస్త్రా
ర్థము చేయుటకు నేను సాహసింపలేను."

జ: బంధువు హితార్థియు నగువాడు తప్పక సాహ
సింప వలసినదే! అది దుస్సాహసము కాదు, నారాయణ
దేవా! ఆ విషయము చెప్పుచున్నాను, వినుము: మిహిర
భోజుడు తన యీ మహత్వముచే నా హృదయార్ద్రతి నాక
ర్షించుకొన్నాడు. నే నిపుడు బంధుభావముతో సంప్రీతితో
నతని నాలింగనము చేసికొన గలను. కాని స్వేచ్ఛగా కన్యా
దానము మాత్రము చేయలేను.

ఆ వాక్యములు వినినంతనే కుంతల ముఖము మ్లాన
మయ్యెను. వెంటనే యామె కళవళముతో శిరము వంచు
కొనెను. మంత్రియు రాజును మరి కొందరు చివాదులును
ఆ పరివర్తనము నుపలక్షించిరి.

జయంత దేవుడు కుంతలవదనము పరిశీలించుచు, "అమ్మా! నీకు పెలవిచ్చి పంపునపుడు మిహిరభోజు డేదయిన నభిప్రాయము వెల్లడించెనా?" అని యడిగెను.

కుం: ఎట్టి అభిప్రాయము, తండ్రీ?

జ: శుల్కక్రీత యగు దాసి దైన్యము త్యజింప నీవు కోరు కొనలేదు. అందుచే నతడు నిన్ను మహిషిగా గ్రహింపక పెలవిచ్చి పంపినాడు. అట్లు పంపునపుడు రాజకన్యోచితమైన గౌరవముతో నీవు లభించినచో నిన్ను పట్టమహిషిగా గ్రహింపగల నను నభిప్రాయ మేదైన ప్రకటించెనా?

కుం: (సంకుచిత భావముతో) స్పష్టముగా న ట్లేదియు చెప్ప లేదు. కాని సంభాషణ సందర్భమును బట్టి తమరు స్వేచ్ఛగా సంతోషముతో కన్యాదానము చేసిన యెడల సుఖపడుదు నను నభిప్రాయము గ్రహించితిని.

జ: మరి నీవు?

కుం: నేనా? నే నేమి చెప్పగలను! తమరు నాకు జనకులు, తమరు స్వేచ్ఛగా సంతోషముతో నన్నెవరి హస్తములందు సమర్పించిన అతడే నాకు పతి యగును. ఈ స్త్రీ జీవనమున కతడే దేవత యగును.

జయంత దేవుడు పుత్రిక ముఖము వంక చూచెను. సిగ్గుచే నించుక వంచిన యామె వదనమున మధురోజ్జ్వల రక్తిమోచ్ఛ్వాసము భాసించెను. అత డది గ్రహించి యిట్లను కొనెను: "ఆహా! ఇది స్వాభావికము! మహాత్వ సంపన్నుడు, మహావీరుడు నగు మిహిరభోజు డీ విధముగా నిట్టి యవస్థ

యందు గూడ కుంతల వంటి ధీరోదాత్త తరుణీహృదయము నాకర్షించినాడన్న నం దాశ్చర్యపడవలసిన దేదియు లేదు.” తరువాత దీర్ఘ నిశ్వాసము విడిచి యిట్లు పలికెను: “అమ్మా! నేను రాజ్యమును సంసారమును త్యజించితిని. నేను నీకు తండ్రి నైనప్పటికి ప్రవ్రజితుడను. నిన్నెవరికైన దానము చేయుటకు నేను కర్తను కాను. నీ సోదరుడే నీకు రక్షకుడు. అతడు హృదయ పూర్వకముగా నిన్నెవరి హస్తములందు సమర్పించునో అతడే నీకు పతి కాగలడు. అతడే నీ స్త్రీ జీవనమునకు దేవత యగును.”

కుం: (సాశ్రునయనయై) తండ్రీ! తమరు జీవించియుండగా, కార్యదక్షులై యుండగా తమరాజ్యము తమ సంసారము నెందుకు త్యజింపవలెను? తమ కే యవమానము కారణముగా నిట్టి నిర్వేదము పొందితిరో ఆ కారణ మిపుడు దూరీకృత మైనది. తమ కుమారి నగు నేను నిష్కళంకముగా తమ చరణసన్నిధికి తిరిగి వచ్చితిని.

జ: వచ్చినమాట వాస్తవమే. కాని ఆ వచ్చుట మిహిరభోజుని మహత్వముచేత, గాని నా శక్తిప్రభావము చేత కాదు. దుర్బలుడనై అసమర్థుడనై నిన్ను పణముగా విక్రయించితిని. మిహిరభోజుని మహాత్వమునకు నమస్కారము. ఇంకను నా యయోగ్యత వలని మనఃపీడ అట్లే యున్నది. అది తొలగి పోవునట్లు లేదు. ఎన్నియో తర్క వితర్కములు చేసికొని యీస్థితి నవలంబించితిని. మరల నీతో నూతనముగా వాదోపవాదములు చేయదలచుకొనలేదు. నా సంకల్పము స్థిరపరచుకొంటిని. నాపై నీకు ప్రేమయు గౌరవమును గలవేని ఇక

నా విషయ మెత్తు వద్దు. నాయీ తుది కోరికను పాలింపుము.. మరల చెప్పుచున్నాను. నేను రాజ్య సంసారముల త్యజించి నాను. తండ్రి మృతుడైనపుడు లేక వానప్రస్థుడై నపుడు కన్య జ్యేష్ఠసోదరుని రక్షణాధీనములం దుండును. కనుక నీవిక సుదర్శనుని రక్షణాధీనములం దుండుము. నిన్ను సత్పాత్రుడు నకు సమర్పించుటకు కర్త ఆతడు. నేను కాను. ఇక నతని కర్తృత్వమందు సుఖింప గలవని ఆశీర్వదించు చున్నాను.

కుంతల మోకరించి పితృచరణములు గట్టిగా పట్టుకొని బాష్ప గద్గద కంఠముతో నిట్లు నివేదించెను. "తండ్రీ! మీ ఆజ్ఞ పాలించెదను. జ్యేష్ఠసోదరుడు సుదర్శనుని రక్షణాధీనము లం దుండెదను. కాని - కాని తమరు సంతోషముతో నెవరి హస్తములందు ఈ స్త్రీజీవనము సమర్పించుట కంగీకరింప జాలకపోయితిరో, ప్రభువైన సోదరుని ఆదేశముచే గూడ నతని హస్తములందు సమర్పితను కాజాలను. వ్యవహారము నకు సోదరుని యధీనమం దున్నను నేను తమ కుమారినే. తమరు ప్రసన్నచిత్తముతో నాశీర్వదింపలేని నే నెవ్వరిని పతిగా వరింపను. జనకుని అవమానము పాలుచేసి దుఃఖపెట్టి రాజ్యసంసారములు త్యజింప జేసిన అభాగ్యురాలను అప నింద ఎవనిపై నున్నదో అట్టి కన్య పతిని దేవతగా పూజిం చుట కర్హురాలు కాజాలదు.

జ: అపనిందయా! లేదు, తల్లీ! నీవు పొరపడుచున్నావు. నేను నీ మీద అపనింద వేయగలనా!

కుం: తమరు వేయ రని నే నెరుగుదును. కాని తమ

మనస్సున కేదేని కష్టము కలిగినప్పుడది నాకపనిందకా గలదు.

జయంతుడు కన్యను సస్నేహముగా లేవదీసి శిరము ముద్దాడి ఇట్లు పలికెను: "నీ సుఖ హేతువుచే నా కెట్టి మనోగ్లానియు కలుగకుండు నట్లు సర్వమంగళ విధాత యగు నీశ్వరు డనుగ్రహించు గాక! ఇపుడు ప్రసన్న చిత్తముతో ని న్నాశీర్వదించు చున్నాను. తల్లీ! నీవు సుఖపడుము. నీకు సమస్తమంగళములు కలుగు గాక! పొమ్మా. తల్లీ! వీరితో గూడ రాజధానికి తిరిగి పొమ్మా. నేటినుండి సుదర్శనుని తండ్రిగా నెంచుకొనుము."

కుం: తమ ఆజ్ఞ శిరోధార్యము. ఒక్కసారి అమ్మగారిని చూచి పోవచ్చునా?

జ: ఆమె ఆశ్రమములో నున్నది. రమ్ము. ఆమె వద్ద గూడ సెలవు తీసికొని వెళ్ళవచ్చును.

కుం: సెలవా! నేడే! ఇప్పుడే పోవలెనా, తండ్రీ! రెండు దినము లుండి తమను సేవించుటకు నా కవకాశము లభింపదా?

జ: నీ కిష్టమైన అట్లే యుండుము. అమాత్యులారా! ప్రధానులారా! మీ రందరికి రాజధానికి తిరిగిపొండు. రక్షకులుగా వచ్చిన అశ్వికు లిక్కడనే యుందురు గాక! కొన్ని దినములైన తరువాత వారు కుంతలను తీసికొని వత్తురు.

## ౪

"ఏమి, తల్లి, అది! ఏమి చేయుచున్నావు?"

"ఓహో! భగవతియా! దయచేయుడు. నమస్కారము."

కుంతల తొట్రుపాటుతో పీతాంబరధారిణియు, వృద్ధురాలును నగు బౌద్ధపరివ్రాజికకు నమస్కారము చేసెను. పరివ్రాజిక శ్రావస్తీనగరమునకు సమీపమందున్న భిక్షుకీసంఘమునకు నాయకురాలు. పేరు క్షేమ.

క్షేమ యథారీతి నాశీర్వదించి, "ఏమి చేయుచున్నావు, తల్లీ!" అని మరల ప్రశ్నించెను. కుంతల సిగ్గుచే నెఱ్ఱవారిన ముఖము వంచుకొనెను. ఆమె పట్టుపడినది, ఇక దాచి పెట్టుటకు వీలు లేదు. కుంఠిత భావముతో నామె యించుక సందేహించుచు, "భగవతీ! ఇప్పుడాకస్మికముగా తమ శుభాగమన మగునని అనుకొన లేదు" అని పలికెను.

భిక్షుకి, "కోసలరాజకుమారి ఏదియో రహస్యకార్యమందు మగ్నురాలై యుండు ననియు, నేను వచ్చి చూచి ఆమెకు సిగ్గు కలిగింతు ననియు నేను కూడ అనుకొన లేదు" అనెను.

కుంతల ముఖ మగ్ని యయ్యెను. ఇదివరకిట్టి క్రూరశ్లేషతో నెవ్వరు నామెతో మాటాడి యుండ లేదు. ఆ శ్లేషకు ప్రతివచనము చెప్ప వలె నని కుంతల మనస్సు ఉన్ముఖ మయ్యెను. కాని యామె యా సంకల్పము నణచుకొని ధీరస్వరముతో, "నే నేదైన నసత్కార్యము చేయుచున్నానా, భగవతీ" అని నుడివెను.

భి: అది పరిశీలించి స్పష్టముగా చెప్పవలసిన ప్రయో
జన మేదైన భగవతికి కలదా యేమి! నీవు చేయుచున్న
కార్యము న్యాయ్యమో అన్యాయ్యమో నీ హృదయము
నీకు చెప్పుటలేదా? మరి నేను వచ్చి నంతనే లజ్జితవై
కుంఠితమనస్క వైతి వేల?

కుం: నే నసత్కార్యము చేయుచున్నా నని కాదు.
భగవతి కప్రియము కలుగు నేమో అని అట్లు శంకించితిని.

భి: అసత్కార్యము కానిచో నాకు మాత్ర మది
అప్రియ మెందుల కగును?

కుం: చిత్రవిద్య నభ్యసించుట యసత్కార్యమా, భగ
వతీ?

భి: కాదు. పరివ్రాజిక నైన నేను కూడ అట్లు చెప్పను.
ఏ విద్య నభ్యసించుటయు అకార్యము కాదు. అయినను
దాని స్వభావము. విధానము. ఉద్దేశము దుర్వినియోగము
లైనపుడు అది అకార్య మని చెప్పవలసి యుండును.

కుంతలకు పట్టరాని నవ్వు వచ్చెను. ఆమె ముఖ మావ
లకు త్రిప్పుకొని అతిప్రయత్నము మీద నాపుకొని, "ఈ
చిత్తరువునం దట్టి దుర్వినియోగము కలదేమో చూడుడు"
అనెను.

భి: కనబడుచున్నది వీర శ్రీమండితుడు సౌందర్య
వంతుడు తేజస్వి అగు యువకుని మూర్తి!

కుం: అగును.

భి: ప్రణయాస్పదుల యాలేఖ్యము లీ విధముగా రాజ

గృహములందును ధనిక భవనములందును కన్యలు సర్వదా చిత్రించుచుందురు.

మధురము లజ్జాన్వితము నగు రక్తిమ కుంతల వదనమున నుద్భాసించెను. ఈషత్కంపిత కోమలస్వరముతో నామె, "అట్లయిన వారీ కళను దుర్వినియోగము చేయుచుందురా!" అని పలికెను.

భి: లేదు. వారి విషయములో నట్లు చెప్పుటకు వీలు లేదు. ఈ యువకుడు కోసల రాజకుమారికి ప్రణయాస్పదుడా?

కుంతల వదనమున లజ్జాతరంగములు లాస్యము చేసెను. ఆమె శిరము మరింత వంచుకొనెను. అపుడు క్షేమ, "ఇత డెవరు— ఇతడు— ఇతడు కాన్యకుబ్జాధిపతి యగు మిహిరభోజుడా!" అని ప్రశ్నించెను.

కుం: (కుంఠిత భావముతో) భగవతీ! అపరాధము చేసితిని, పట్టుపడితిని, తమ యిష్టము వచ్చినట్లు తిరస్కరింపుడు. కాని ఈ విషయములో నెట్టి ప్రశ్నలకును సమాధానము చెప్పజాలను.

భి: (స్నేహకోమల స్వరముతో) నీవు బ్రహ్మచారిణీ ధర్మ మవలంబింపకున్న నిందు నీ యపరాధము గ్రహించుటకు వీలులేదు. తల్లీ! ఇట్టి కఠోరవ్రత మెందుల కవలంబింప వలసి వచ్చినది?

కుం: నా కోరిక ఈ జన్మములో సఫలము కాదేమో అని.

భి: పరజన్మమందు సఫల మగు నను నాశ నీ హృదయమున నెలకొని యున్నదా?

కుం: అగును. ఈ జన్మమందు చేసిన సాధన జనులకు పరజన్మము నందు సఫలము కాదా!

భి: కావచ్చును. కాని నా కా సాధన తెలియదు, తల్లీ! బౌద్ధ పరివ్రాజికల సాధనాలక్ష్య మిది కాదు. మాకే కామ్య సిద్ధియు లేదు. సమస్త కామనలు నశించి నిర్వాణము లభించుటయే మాకు పరమావధి.

కుం: నిర్వాణమా! ఎవరికి నిర్వాణము, భగవతీ!

భి: కర్మలకు మూలమైన కామనలకు. కామ్యము నశించి నంతనే కర్మ వినాశము నొందును. కర్మ నశించి నంతనే జన్మమునకు నివృత్తి కలుగును. అందువల్ల జీవనమునకు నిర్వాణము సిద్ధించును.

కుం: జీవనమునకు నిర్వాణమా! అనగా పూర్తిగా లోపించుటయా! ఎందులో? ఎక్కడ, భగవతీ?

భి: శూన్యమందు.

కుం: శూన్యమందా? మాయాశబలితమైన జీవాత్మ పరమాత్మ యగు బ్రహ్మతో నైక్యము పొందు నని సనాతన ధర్మము చెప్పుచున్నది.

భి: ఆ బ్రహ్మయే శూన్యము.

కుం: బ్రహ్మస్వరూపము సచ్చిదానంద మని వారు చెప్పుదురు.

భి: అట్లే చెప్పుదురు. మొదలు బ్రహ్మస్వరూపనిరూపణమునకు 'నేతినేతి' అను మార్గము తప్ప మరి యొకటి లేదే! అట్టియెడ సత్తు కలదని విశ్వసించుట యెట్లు? సత్తు మిథ్య యగునేని చిత్తు ఆనందము మిథ్యయగును. మిథ్యయైన.

సత్తు ఆనందదాయకము కాగలదా ?

శకుం: ఇంత నిగూఢమైన తత్త్వరహస్యము నేను తెలిసికొనలేను. సమస్త జీవన మార్గములు ఆనందము వైపునకే పోవుచున్నవి. ఆనందమెట్టిదైన కానిమ్ము. అదియే నేను తెలిసికొనగలిగితిని.

భి: ఆనంద మెక్కడ నున్నది, తల్లీ! జీవన మున్నంత వరకు దుఃఖమే! నిర్వాణమే ఆదుఃఖమున కంతము!

శకుం: అట్లయిన ఈ జీవనము నీ సంసారము నెందులకు ఉత్పన్నము లైనవి? కేవలము దుఃఖమే యగునేని దుఃఖపూర్ణమైన యీ సంసార మంతయు నొకానొక మహారాక్షసుని క్రూరలీల కావలసి వచ్చును. లేదు, భగవతీ! లేదు. అట్టిది నా హృదయము నంగీకరించుట లేదు. ఆనంద మున్నది. కామనలో ఆనంద మున్నది. కామన సఫలము కాగలదను నాశలో ఆనంద మున్నది. సాధనా పరిపూర్తిలో నేయానందము కలదో అది ఇంకను గొప్పది, ఇంకను సుందరమైనది. ఇహజన్మమందు గాని పరజన్మమందు గాని దేనిని పొందినపుడీ జీవనము చరితార్థ మగునో దేని నాశ్రయముగా హృదయాంతరమున ననుభవింతురో అట్టి ఆనందమును కల్పిత దుఃఖ భయముచే నెవడు త్యజించును ?

భి: కల్పితము కాదమ్మా! దుఃఖమే సత్యము, ఆనందము కల్పితము.

శకుం: దుఃఖము కూడ సత్యము గాక! ఆనందము కల్పితము కాదు. ఆనందమే సత్యమైనది. దుఃఖములో గూడ గొప్ప ఆనంద మున్నది. ఆ యానందస్పర్శచే సకల కలుష

ములు క్షాళితములై జీవనము నిర్మలమైన శాంతితో నిండిపోవును భగవతీ! అట్టి దుఃఖము నైన కోరుకొందును గాని ఆనందమును మాత్రము త్యజింపజాలను.

భి: తెలిసినది, తల్లీ! కాంక్షామోహము నీ హృదయమున గాఢముగా నాటుకొని యున్నది. ఈ బ్రహ్మచారిణీ వ్రతము నీకు అవలంబనీయము కాదు

కుం: ఏమి చేయుదును, భగవతీ! ఏ సాధనతో నా జీవనము గడపుదును? ఈ జన్మమున వాంఛితము సఫలము కానప్పుడు పరజన్మము నందైనను ఏ సాధనతో నది పూర్ణముగ ఫలించును?

భి: ఆ సాధనామార్గము నాకు తెలియదు, తల్లీ! ఈ జన్మమందే నీ కోరిక సఫలమగు పక్షములో నీ యభ్యంతర మేమి? ఎవరి చిత్తములో వాంఛామోహము ప్రబలముగా నున్నదో, ఎవరి బుద్ధి కాంక్షయే సుందరమైనది ఆనందమైనది అని ప్రబోధించుచున్నదో, ఎవరు కోరిక త్యజింప నిచ్ఛగింపరో వారికా మనోరథసిద్ధి ఎంత శీఘ్రముగా నైన నంత మంచిది. అప్పుడా కాంక్షలోని వాస్తవము బయలుపడును. అంతట నది అధివ్యాధిరూపముగా జరామృత్యు రూపముగా కనబడును. అప్పుడు మోహము తొలగిపోయి మనస్సు నిర్వాణోన్ముఖ మగును.

కుం: ఈ నా కోరిక ఈ జన్మమునలో సఫలము కాజాలదని భగవతి యభిప్రాయమా?

భి: ఎందులకు కాజాలదో నాకు బోధపడలేదు. నీ తండ్రి నిన్ను గురించి స్పష్టముగా నేదియు చెప్పియుండలేదు.

నీ సోదరు డగు సుదర్శనుని హస్తములందు నీ భార మర్పించి నాడు. ధర్మప్రకారము నీ పోషకుడే నీకు రక్షకుడు. సుద ర్శను డేదియైన అభ్యంతరము ప్రకటించెనా?

కుం: లేదు. నేను స్వయంవర నగుట మంచి దని ప్రస్తా వించినాడు.

భి: అది ఉత్తమము. మరి స్వయంవర సభకు ఆహ్వా నించుటలో నేదియైన వ్యతిక్రమము సూచించినాడా?

కుం: లేదు. సూచింపకపోగా కులవంశనిమిత్తము లేకుండ ఆర్యావర్తములోని రాజులను రాజపుత్రులను ఆహ్వా నించెద నని స్పష్టముగా చెప్పుచున్నాడు.

భి: అందుకు మీ జనకు లంగీకరించినారా?

కుం: తమ అంగీకార మనావశ్యక మనియు, సుదర్శనుడు యుక్తమని తలచినది చేయవచ్చు ననియు, తనకెట్టి యభ్యం తరము లేదనియు తండ్రిగారు చెప్పినారు.

భి: ఈ స్వయంవరము నీ కిష్టము లే దనుకొనెదను.

కుం: లేదు

భి: తల్లీ! కన్యాధర్మము నీవు ఉత్తమ రీతిని పాలించు చున్నావు. కాని నీ జనకుడు తన పితృధర్మము పాలింపలేక పోయినాడు. ఏ గర్వముతో నిన్ను స్వేచ్ఛగా భర్తృనా త్కృత చేయుట కంగీకరింప లేకపోయినాడో ఆ గర్వము వర్జింపజాలని యెడల నతని సంసార త్యాగము వానప్రస్థ మును వ్యర్థము లగును.

జయంతుడు: (చప్పున ప్రవేశించి) కావు, భగవతీ! వ్యర్థము కావు. సంసార త్యాగము వల్లను వాన ప్రస్థము

వల్లను ఎంత సార్థకత కలుగుట కవకాశ మున్నదో అంతయు తెలిసినది. గర్వము వర్జింప గలిగినాను.

భి: ఓహో! మహారాజులా!

కుం: ఓహో, నాయనగారా!

జ: అగును, కుంతలా, నేను నీ తండ్రిని! భగవతీ! నేను మహారాజును కాను. మీ దాసుడు జయంతదేవుడను. ఈ దాసుని ప్రణామము గ్రహింపుండు.

భి: స్వస్తి. జయంతదేవా! మీ రాకస్మికముగా నిచటికి వచ్చితి రేల?

జ: సుదర్శనునితో మాటాడవలసిన యవసర ముండుటచే వచ్చితిని. వచ్చినంతనే మీరు కుంతల గృహమందున్నారని వింటిని. క్షమింపుడు. రహస్యముగా మీ యిరువుర కెట్టి సంలాపము జరుగుచున్నదో వినవలెనని కుతూహలము కలిగినది.

భి: (నవ్వుచు) మీరు వినరాని రహస్యసంభాషణ మేమియు జరుగుట లేదు. ఉన్నట్లుండి మీ కిట్టి కుతూహల మెందుకు జనించినది?

జ: తీర్థయాత్రనుండి నేడే ఆశ్రమమునకు తిరిగివచ్చితిని. రాగానే కుంతల స్వయంవరమునకు సమ్మతింప లేదనియు, పైన మీకు శిష్యురాలైన దనియు, శీఘ్రకాలములోనే మీ మతమున భిక్షుకీ ధర్మమునందు దీక్ష గ్రహించుననియు వింటిని. అందువల్ల ఇంచుక ఉద్విగ్నుడనై సుదర్శనునితో నాలోచింప వచ్చితిని. రాగానే మీరు కుంతలా గృహమందున్నారని తెలిసినది.

భి: ఓహో! అదియా కారణము! తెలిసినది కుమారికి శిక్ష యెంతవరకు కలవడినదో, భిక్షుకీధర్మము నవలంబించుట కంగీకరించిన దేమో, ఒకవేళ ఉపాగ్రహణము నేడే జరుగు నేమో తెలిసికొనుటకై మీ కింత కుతూహలము కలిగిన దనుకొందును.

జ: అగును, భగవతీ! ఆ మాట సత్యమే!

ఇట్లు పలుకుచు జయంతు డించుక నవ్వెను. క్షేమాభిక్షుకియు నట్టి నవ్వుతోడనే, "కుమారి వ్రాదము నెంత వరకు తెలిసికొన్నారు?" అని యడిగెను.

జ: (మరల నవ్వుచు) నా సంసారత్యాగము నా వానప్రస్థము వృథాయైన వని భగవతి పలుకుచుండగా వచ్చితిని. శిష్యురాలి యెడ మీ శిక్షాప్రదానము కూడ వ్యర్థమై పోయిన దని చెప్పగలను.

భి: అగును. అట్లే అయినది. ఆ పరాజయము నేను స్వీకరించుచున్నాను. మహామోహునితోడి సంగ్రామమందు భగవంతుడగు తథాగతు డొక్కడే సఫలమనోరథు డైనాడు. వారి శిష్యురాలయిన యీ దీనురాలికి ఆ సిద్ధి లేదు. సరియే! మీ సంసార త్యాగము వానప్రస్థము సార్థకములైన వని యించుక గర్వోక్తి పలికితిరే. అందుకు తార్కాణ మేమి?

జ: నా కుమారి స్వయంవరములో తన కిష్టమైన వానిని వరించును. అందుకు సంతోషముగా నే నంగీకరించెదను. అందు వలన పుత్రికా విషయములో నా పితృధర్మము పాలింతును.

భీ: (ఇంచుక చిరునవ్వుతో) జయంతదేవా! ఈ చిత్త పరివర్తనమేనా వానప్రస్థమునకు ఫలము?

జ: కొంతవరకు. కాని ప్రస్థానఫలము కాదను మాట నిజమే. రాజ్యబంధనము రాజ్యమోహము త్యజింపలేకున్న చిత్తమునకు ప్రశాంతి యుండదు. నా గౌరవము కాపాడుటకు కుంతల చూపించిన త్యాగమాహాత్మ్యము కూడ నా గర్వము నణచి యుండలేదు. కుంతల తిరిగి వచ్చినంతనే మిహిరభోజుని మహత్వము సౌదార్యము ననుభవించి యామె యతనియందనురక్తయైనదని తెలిసికొంటిని. అంత అనురాగమున్నను నేను హృదయపూర్వకముగా నొసగకున్న ఆమె అతనిని పతిగా వరింపదు. ఈ విషయము స్ఫురించినంతనే నాహృదయము మిగుల వ్యథపడినది. నా యీ గర్వవేదికమీద నా కుమారి సుఖము బలి యిచ్చుటకు నా కేమి యధికారమున్నదని తలపోసితిని. మిహిరభోజుని మహోదారస్వభావము నా హృదయాంతరమును స్పృశించినది విరక్తికి బదులు హృదయములో ననురాగమే యనుభవించితిని. అయినను కులగర్వ మొక్క సారిగా త్రోసివేసికొనలేక పోయితిని. కుంతల ఇప్పుడు భ్రాతధీనగదా! అత డేది యుచితమని తోచిన దానిని చేయును. నే నభ్యంతరము పెట్టకుండ నుండెదనని మనస్సును ప్రబోధించుకొంటిని.

భీ: ఇపుడా యభ్యంతరాభావము అనుమోదనముగా మారినదనుకొందును. ఈ పరివర్తనము తీర్థయాత్ర వల్ల కలిగినది కాబోలు!

జ: అగును. భగవతీ! తీర్థయాత్రలో కౌన్యకుబ్జము లోని నానాప్రదేశములందు పర్యటనము చేసితిని. ప్రతి ప్రదేశమందును మిహిరభోజుని మహత్వము, రాజ్యపాలన దక్షత, ధర్మనిష్ఠ, తేజస్వంత, క్షమ మొదలైన క్షత్రియోచిత గుణములను గౌరవమును గ్రహించితిని. ప్రజావర్గ మతని నాది వరాహావతారముగా నెంచుటకు పూజించుచున్నారో అప్పుడు గ్రహించితిని. వరాహావతారము కూడ భగవంతుని మహనీయరమే కదా! కనుక శ్రీరామచంద్రుని వంశములో జనించిన కన్య అతని సంసర్గవల్ల కళంకిత కాజాల దని నిశ్చయించు కొంటిని.

జ: అనగా మిహిరభోజునకు హృదయపూర్వకముగా కన్య నొసగుట కంగీకరించినా రనియే కదా మీ యభిప్రాయము! (నవ్వుచు) తెలిసినది. గర్వమోహముల త్యాగము వల్ల కాకున్నను వాని తృప్తికొరకు మవలంబించిన విధానమే జయంత దేవుని పితృధర్మ పరిపాలనమునకు సిద్ధపరచినది! అగుగాక! మరి కుంతల స్వయంవరమున కిష్టపడుట లేదు.

జయంతుడు కుంతల వంక చూచెను. కుంతల శిరము వంచుకొనెను. ఆమె ముఖవైఖరి గ్రహించి జయంతు డిట్లనెను. "అట్లయిన స్వయంవరము మానిపించి మిహిరభోజున కాహ్వానము పంపుమని సుదర్శనునితో చెప్పెదను.

ఆ మాటలు వినినంతనే కుంతల పట్టరాని సంతోషముతో ఆనందాశ్రువు లురలుచుండ జయంతుని చరణముల పైబడి నమస్కరించెను. జయంతుడు సస్నేహముగా నామెను లేవదీసి అర్ద్ర నయనములతో నామె శిరము మూర్కొనెను.

భ: (సంతోషముతో) పాపము! ఈ యారు మాసముల నుండి చిట్టి తల్లి హృదయ మెంత సంక్షోభించినదో! ఇక నేమి, కుంతలా! నీ మనోరథ మీడేరినది కదా! ఇక నా చిత్తరువు పూర్తి చేసి భద్రముగా నుంచుము. వివాహ సమయమున నీ ప్రాణాస్పదుడు దాని నమూల్యోపహారముగా గ్రహింపగలడు.

కుంతల లజ్జాసంతోషములతో భగవతికి నమస్కరించెను. భిక్షుకి సాదరముగా 'స్వస్తి' అని యామె నాశీర్వదించెను.

# శుష్క వేదాంతి

## 1

ఒకానొకరాజు. ఆ రాజు పేరు జీవనగుప్తుడు. అతని రాజ్యము శాకద్వీపము. రాజధాని పేరు జ్ఞాపకము లేదు. అతని ధనమునకు మితిలేదు, ఐశ్వర్యమున కంతము లేదు. పరిజనులకు పరిమితి లేదు. అతని గజశాలలనిండ గజములు, అశ్వశాలలనిండ అశ్వములు, ఉద్యానము నిండ పుష్పములు గలవు. రాజధాని భూవ్యాదయమునుండి బయలుదేరి ఆకాశమును చీల్చుకొని యెక్కడనో లీనమైనది. సౌధ శిఖరములు మేఘములలో దాగికొన్నవి కాబోలు, తల యెత్తి పరికించినను గానరావు.

ఆ రాజనగరిలో ప్రతి సౌధమందును ద్వారములు చందన తరువుతోడను, గవాక్షములు దేవదారుతోడను నిర్మితము లైనవి. స్తంభములు పాలవంటి చంద్రకాంత శిలలతో జేయబడినవి. వాని మీద కుంకుమప్రావువలె నెఱ్ఱనైన పద్మరాగశిలలు, వాని మీద గోమేధికపు చాందిని యుంచుటకు దూరమునుండి చూచిన నంతయు పలాశవనములో పలాశములు పుష్పించి యున్నట్లు కనబడును. ఆ స్తంభములందలి చిత్రవిచిత్ర శిల్పరచనా చాతుర్యమిం తింత యని చెప్ప నలవికాదు. కొన్ని చోటుల మయూరములు పింఛములు విప్పి వివిధ వర్ణములు విస్తరింప జేయుచున్నట్లున్నవి. కొన్ని యెడల గజములు తొండము లూగించుచున్నట్లున్నవి. కొన్ని తావుల సింహములు గోళ్ళు విప్పి కొట్టబోవుచున్న

ట్టున్నవి. కొన్నిస్థలముల వ్యాఘ్రములు కోపముతో నోళులు తెరచి గాండ్రించుచున్న ట్లున్నవి. ఈ విధముగా చంద్రశిలా స్తంభములందెన్నో చిత్ర విచిత్రములు చెక్కియున్నవి. గోడలయందు చిత్తరువు లమర్చబడి యున్నవి. ఒకచోట సీతాపహరణము, మరియొకచోట పంచవటి, ఇంకొకచోట మాయామృగము వేరొకచోట అశోకవనము. ఈ రీతిగా నిపుణులైన చిత్రకారులు మనోహరముగా చిత్రించిన చిత్రము లెన్నో యాగోడలందు శోభించుచున్నవి. స్తంభముల పైభాగమున గరుడపచ్చరంగు మేలుకట్టు, దానిమీద పెద్ద పెద్ద శతపత్రములు, వాని ప్రక్క లతలు, పర్ణములు, శకుంతములు, నానావర్ణములతో నయనరంజకముగా చిత్రింపబడియున్నవి.

ఆ జ్ఞాపకము వచ్చినది – ఆ రాజధాని పేరు సప్తసౌధపురము. ఆపురములో ఏడు ప్రాసాదములు. ఆ రాజున కేడుగురు రాణులు. అతడొక్కొక్క మేడయం దొక్కొక్క రాణి నుంచెను. ఆరాణుల మెడలలో ముత్యాల హారములు, ముక్కులకు వజ్రాల ముక్కుపుడకలు, చెవులకు మరకతముల కమ్మలు, నల్ల పట్టుకుచ్చుల వలె నిగనిగ లాడు నీలకుంతలములందు తళతళలాడు గజముక్తాహారములు, హస్తములకు శరీరచ్ఛాయతో మేళవించు సువర్ణ కంకణములు, వేళ్ళకు కెంపులు కూర్చిన యుంగరములు, పాదము మొదలు శిరస్సు వరకు సువర్ణమణి ముక్తాభరణములతో ఆ రాజపత్నుల సౌందర్యము సముజ్జ్వలమై యెంతో శోభించు చుండెను. ఆ

సప్తప్రాకారముల సప్త సౌధములందు సప్తరాజ్ఞులతో ఆ రాజు సుఖముగా రాజ్య మేలుచుండెను.

ఆ రాజు ప్రతి సంవత్సరము వసంతోత్సవము చేయుచుండును.

ఫాల్గుణవాయువులు పారవశ్యము కలిగించు సువాసనలు వెదజల్లుచుండెను. వాని నాఘ్రాణించి సంతనే శిశిరాంగన కేదో స్ఫూర్తి యుదయించి శరీరము పులకరించెను. ఆమె ధరించిన బూడిదరంగు చీరె పచ్చరంగుగా మారెను. శరీరమంతటను ముడుతలు పడియున్న చర్మము సమమై నునుపెక్కి సుందరమాయెను. శుష్కించిన చూపులు మెరపులతో గూడిన మేఘముల వలె సొగసులు వెలార్చెను. రెల్లుపూల వలె నెరసిన కేశములు తుమ్మెద రెక్కలవలె నిగనిగలాడెను. పగుళ్ళు వారిన పాదములు పద్మములవలె మృదువులయ్యెను. ఎఱ్ఱ వారిన వ్రేళ్లు సంపెంగ మొగ్గలవలె స్నిగ్ధములయ్యెను. ఇపుడా శిశిరాంగన నెవరు గుర్తింపగలరు? నల్లకలువల క్రీగంట చూపులు. పండు దానిమ్మగింజల పెదవులు, మల్లెమొగ్గల దంతములు, మాలతీ గుచ్ఛముల మందహాస రేఖలు. మరకత మాణిక్యవర్ణములు గల జరీ చీరెల విన్నాణమూ ఆమె నిండు హృదయమును చెప్పక చెప్పుచుండెను. ఆమె యిపుడు వసంతాంగన యైనది.

ఉత్సవ మారంభ మగుటకు ముందు వసంతాంగన వంకీ ధ్వని చేసినది కాబోలు-ఆ ధ్వనితో ప్రతివనమందును, ప్రతి వృక్షమందును, ప్రతిపత్రమందును పులకలు మొలకెత్తినవి. ఎక్కడనో దాగికొన్న ట్లుండిన సంపెంగ మొక్క లేచి తల.

యెత్తి వేసి విరియబడ నూగుచు నూగుచు మృదుమధురగా పాట్ట మారంభించినది. మామిడి ప్రాలకు కొంచెము కొంచెము సువాసన జనించినంతనే తేనెటీగల వ్యూహములలో వ్యాకులత ఆరంభ మైనది. దట్టమైన ఆకుల చాటున తీగె యుయ్యాలలో నూగుచు నూగుచు కువ్వూ కువ్వూ అని కోయిల కంఠము సవరించుకొన దొడగినది. శకుంతములు కంఠము లెత్తి పర్వతగుహాలు ప్రతిధ్వనించు నట్లు మహానందముతో గానముచేయ మొదలిడినవి. లతల నూపుచు, పత్రముల గదలించుచు మందానిలము వీవ నాగినది. దిక్కు లన్నియు మహోత్సాహముతో నిండి పోయినవి. అపుడు రాజు "వసంతము వచ్చినది, వసంతోత్సవమునకు సర్వము ఆయ త్తము చేయుడు." అని పరిజనము నాజ్ఞాపించెను.

రాజు వసంతోత్సవమునకు బయలుదేర నున్నాడని తెలిసినంతనే సప్తప్రాసాదములందును కలకలము బయలు దేరినది నగరద్వారము లందు నౌబత్తులు మ్రోగినవి. సన్నాయీలు భైరవీరాగ మాలపించినవి. చర్మవాద్య ములు, సుషిరవాద్యములు, తంత్రీవాద్యములు, ఘనవాద్య ములు ఒక్కపెట్టున మ్రోసినవి. అశ్వములు కంఠములు వంచి సకిలించినవి. గజములు తొండము లెత్తి జయశబ్ద మూచరించుగా ఘీంకారములు చేసినవి. ఏడు మేడల నుండి ఏడుగురు రాణులు వెడలి వచ్చి మేనాలలో కూర్చుండిరి. రాజు ధవళాశ్వమెక్కి ఏడుగురు రాణులు వెంటరా, సింహ ద్వారము సమీపించు చుండెను. ఆ సమయమున సింహద్వా రమునుండి పురుషు డొకడు వచ్చి రాజు నెదుట నిలువబడెను.

ఎక్కడి వున్న వారక్కడ నిలిచిరి. కోలాహల మొక్క సారిగా నణగిపోయినది. పాటలు, హాస్యములు, చతుర్విధ వాద్యములు—అన్నియు రాజాజ్ఞచే ఐంద్రజాలిక శక్తిచేత వలె నిస్తబ్ధములై పోయినవి. గుఱ్ఱముల వంకర మెడలు నిట్టనిలచినవి, ఏనుగుల తుండములు నిశ్చలములైనవి. వాహకులు బుజములపై నుండి మేనాలు క్రిందికి దింపిరి. రాజు గుఱ్ఱము దిగెను,

వచ్చిన పురుషుడు పరమ సుందరుడు, దీర్ఘ శరీరుడు, ఉన్నత శిరస్కుడు, తేజోవిభాసిత నేత్రుడు, ఉజ్జ్వలవదన మండలుడు. అతని శరీరము బంగారము పోత పోసినట్లున్నది. ఆరోగ్యము మూర్తీభవించి నట్లున్నది. అతని ముఖము, హస్తములు, పాదములు పద్మరాగ రంజితములై ముట్టినచో రక్తము స్రవించునట్లున్నవి. ఒక్క కౌపీనము తప్ప అతని శరీరమున వేరు వస్త్రము లేదు. ఆపురుషుని జూచి రాజు స్తంభితుడై కొంత సేపటికి తెప్పిరిల్లి, "మహానుభావా! తమ రెవరు!" అని ప్రశ్నించెను.

ఆగంతుకుడు, "మహారాజా! నేను సన్న్యాసిని" అనెను.

రాజు: మహాత్మా! నా యవివేకమును మన్నింపుడు. సన్న్యాసమనగా నేమి? సన్న్యాసి యన నెవరు?

సన్న్యాసి: మహారాజా! సన్న్యాసి యనగా సత్తును అసత్తును నశింప జేసికొని నిర్వికారత నొందినవాడు. ఏది పరమ సత్యమో, దానిని దెలిసికొనినవాడు. ఆ పరమ సత్యము ఒక్కటే! అదియే బ్రహ్మ! ఆ బ్రహ్మ యొక్కటె సత్యము.

మిగిలిన దంతయు శూన్యము. ఈ కనబడు జగత్తంతయు మన మాయాసృష్టి. మన దృష్టిభ్రమము!

రాజు: (విస్మయముతో) మహాత్మా! ఈజగత్తు శూన్యమా! ఈ సంసారము, ఈ యాకాశము, ఈ పృథివి, ఈ పరిజనము, ఈ యశ్వములు, ఈ గజములు — ఇవి యన్నియు శూన్యములా?

సన్యాసి: స్వప్నము, మహారాజా, స్వప్నము! ఛాయాగ్రాహక యంత్రము ద్వారా బయలు వెడలు దృశ్యము! ఈ గుఱ్ఱములు, ఈ యేనుగులు, ఈ పరివారము — వేయేల-మీరు చూచుచున్న దంతయు మీ చర్మచక్షువుల కల్లు కనబడు చున్నది. కాని యథార్థముగా అవి తురగములు కావు. అవి కరులు కావు, అది దాసదాసీ జనము కాదు. అవి యన్నియు కేవలము పరమాణువుల సంయోగముచే జనించిన యాకృతి విశేషములు. అందమైన పుష్పములు, సుందరులైన స్త్రీలు, స్వాదువైన సోమరసము, పూజలు, ఉత్సవములు - ఇవి యన్నియు నా కనులకు కేవలము పరమాణువులుగా కనబడు చున్నవి. ఈ జగత్తునకస్తిత్వమే లేదు. అట్టి శూన్యమును దాటి నేను పరమసత్యమును గ్రహించి నాను.

రాజు ఇట్టి పలుకు లిదివర కెప్పుడును వినియుండ లేదు. అందుచే నవి యతనికి తలక్రిందుగా తోచినవి. కొంతసేపు మౌనముద్ర వహించి, రాజు మరల నిట్లనెను: “మహాత్మా! క్షమింపుడు నా కిప్పు డవకాశము లేదు. నేను వసంతోత్సవమునకు పోవలసి యున్నది, ఈ రాజ్యములో ఈ యుత్సవము

మా రాజ వంశమందు వేల వత్సరముల నుండి పరంపరగా వచ్చుచున్నది. ఏయేటి కాయేడు సుసంపన్న మగుచున్నది. లక్షలకొలది మా వంశీయుల స్మృతి రేఖలతో పవిత్రతను గాంచినది. దీని నాపుటకు నాకు సాధ్యము కాదు, మహాత్మా! తాము రాజనగరిలో నుందుడు. ఒక్క మాసములో నీ యుత్సవము పూర్తి చేసికొని వచ్చి, తరువాత తమ యుప దేశము విందును. తమకు ఎప్పుడేది యవసర మగునో సెల వండు. వెంటనే తమ యాజ్ఞానుసారము జరుగును."

అపుడు సన్న్యాసి యిట్లనెను: "మహారాజా! నేను సన్న్యాసిని. నా కేమియు నవసరము లేదు. మీరు ఉత్సవమునకు వెళ్ళిరండు. నేను మీ కోసము నగరులో కనిపెట్టుకొని యుందును."

సన్న్యాసి వెడలిపోయెను.

ఓహో! వాద్యకరులారా! నిశ్శబ్దముగా చిత్రిత ప్రతిమల వలె నిలబడియున్నా రేల! మ్రోగింపుడు. మీ మీ వాద్యములు మ్రోగింపుడు. అరుగో! రాజుగారు గుఱ్ఱ మెక్కు చున్నారు! వాహకులు రాణుల మేనాలు బుజముల పై కెత్తి కొను చున్నారు! మ్రోగింపుడు, మ్రోగింపుడు!

సంజీవినీస్పర్శ యైనట్లు పరివార మంతయు మేలు కొన్నది. ఢంకాలు భేరీలు ధమధమ శబ్దములతో ధ్వనించినవి. ఖంగుఖంగున కంచు తాళములు మ్రోసినవి. పిల్లన గ్రోవులు కోయిలలు కువూ కువుల నతిశయించినవి. వీణా నాదములు మూర్ఛనలు వెలయించినవి. అశ్వములు మెడలు

వంచి గిట్టలతో భూమిని గీరుచున్నవి. గజములు ఘీంకా రీతుల తొండము లాడించుచున్నవి. బురుజులనుండి మేఘ గంభీర రవములతో నౌబత్తులు మ్రోగినవి. మేళగాండ్రు సన్నాయీలతో తలలు త్రిప్పుచు వసంతరాగము వాయింప నారంభించిరి.

రాజు ధవళాశ్వ మెక్కి యేనుగు రాణులతో వనోత్స వమునకు బయలు దేరెను. అతని వెనుక లక్షలకొలది సైన్య ములును, వాని వెనుక వేలకొలది ఏనుగులును, వాని వెంట మేళగాండ్రును, వారి వెంట మంత్రి సామంతాదులును వారి వెనుక పరివారమును నడువసాగెను.

ఆ యుద్యానవన మనుపమాన వికాసముతో వెలయు చుండెను. తాలములు, తమాలములు, సాలములు, రసాల ములు, పొన్నలు, పొగడలు మొదలైన వృక్షము లపూర్వ శోభతో ప్రకాశించుచుండెను. ఎటు చూచినను పచ్చరంగే! ఎంత దూరము చూచినను పచ్చరంగే! వనమంతయు పచ్చ రంగుతో నిండిపోయినది. ఆ పచ్చరంగు నడుమ మల్లెలు, జాజులు, ఎఱ్ఱ గన్నేరులు, పసుపు గన్నేరులు, మెట్ట తామ రలు, నీలాంబరములు, మొదలైన రంగురంగు పూవు లెన్నియో మనోహరముగా పుష్పించియుండెను. మందానిలు డలస గమనముతో కన్నెపూల కలవరపెట్టుచు, ప్రౌఢపుష్ప ముల పరిహసించుచు, క్రొత్తపూలతో కొండాట మాడుచు, ప్రాతవిరుల పలుకరించుచు పిచ్చెలపిడి విహరించుచుండెను.

నవనవలాడు వృక్షములు, నిగనిగలాడు లతలు, పకపక లాడు కుసుమములు గల యా యుద్యానవనములో వసం

తోత్సవము మహానందముతో ప్రారంభ మయ్యెను. ఆ సం
తోషములో రాజు సన్యాసి వాక్యములు పూర్తిగా మరచి
పోయెను.

వనముతో పరిచయము మానవునకు నేటిది కాదు. అది సృష్ట్యాదినుండి వచ్చుచున్నది. వనవారిద్వర్ణము నీక్షించి మానవు డెపుడు తన్మయు డగునో యప్పు డది యతనికి కేవలము వన మాత్రముగా నుండదు. అది యేదియో విశిష్టతను పొంది యతని కానందదాయక మగును. ఎపుడు వన సముజ్జ్వలత అతని హృదయమునం దంకిత మగునో అప్పు డతడు సజీవముగా నుండక మూకీభావము వహింపక పరవశుడై ఆనందించుచు, హసించుచు, క్రీడించుచును, గానము చేయును. అట్టి గానము వెన్నెలరేయి యంతరిక్ష మందు జ్యోత్స్నాస్వరముతో కలిపి రసాలములు మనోహరముగా పాడుచుండ విద్యుద్వర్ణము గల గంధర్వ స్త్రీలు వినుచుందురు.

నెల తరువాత వసంతోత్సవము పూర్తిచేసికొని రాజు రాజధానికి తిరిగి వచ్చెను. వచ్చినంతనే మంత్రిని బిలిచి, "మంత్రీ! సన్యాసి యెక్కడ నున్నాడు? ఆయనవద్దకు నన్ను తీసికొని పొమ్ము" అని పలికెను. మంత్రి రాజును సన్యాసి కడకు తీసికొని పోయెను.

సన్యాసిని జూచినంతనే రాజు చకితు డయ్యెను. తాను మాసము క్రిందట చూచిన సన్యాసి యితడేనా! ఆ మనోహార శరీరుడు, ఆ యున్నత శిరస్కుడు, ఆ తేజోవిభాసిత నేత్రుడు ఇతడేనా! ఆ యారోగ్య మేది? ఆసువర్ణచ్ఛాయ యేమైనది?

ముఖము కళావిహీన మైనది. నేత్రములు ముకుళించుకొని
పోయినవి. లలాటము ముడుతలు పడిపోయినది. శరీరమెం
డిన కొబ్బరి బొండమువలె కుంచుకొనిపోయినది. రాజు విస్మ
యాన్వితుడై, "మహాత్మా! ఏమి ఈ పరివర్తనము?" అని
యడిగెను.

సన్యాసి యెండిన పెదవులతో మందహాసము చేయుచు
మృదుస్వరముతో, "మహారాజా! ఈ నెలరోజుల నుండి నా
కాహారము లేదు" అనెను.

రాజు కన్నులు క్రోధముచే నెఱ్ఱవారెను. శరీరము కట
కట కంపించెను. కోశము లోని ఖడ్గము ఝణ ఝణ మని
ధ్వనించెను. వక్షముమీద రత్నములు చకచక ప్రకాశిం
చెను. రాజు మంత్రివైపు దృష్టిసారించి, దృగ్బాణములు
వర్షించుచు, కఠోరస్వరముతో, "ఇది యేటి ప్రవర్తనము,
మంత్రీ! నా రాజ్యములో నిదివర కెన్నడును పిపీలికము
సైతము నిరాహారముగ నుండ లేదే! అట్టి రాజ్యములో
రాజున కతిథియై రాజపురమం దున్న సన్యాసి మాసము
పూర్తిగా నిరశనుడై యుండుటా! దీనియర్థమేమి, మంత్రీ!"
అని గర్జించెను. క్రోధ వశమున నతని వాక్కు రుద్ధమై
పోయెను.

మంత్రి కృతాంజలియై శాంతస్వరముతో, "మహా
రాజా! ఈ దాసుని యపరాధము మన్నింపుడు. వనోత్సవ
మునకు పోవునపుడు సన్యాసి తన కేమియు నక్కర లేదని
చెప్పుచుండగా వినియుంటిని. అందుచే ఆయన భోజనమున
కేర్పాటు చేయలేదు. సన్యాసి కూడ నెట్టి యనుజ్ఞయు
నిచ్చియుండలేదు" అని విన్నవించెను.

రాజు సన్యాసివంక తిరిగి, "మహాత్మా! తమ కెట్టి యాహారము కావలెను?" అని యడిగెను.

సన్యాసి, "మహారాజా! నేను కురువర్షమున రాజపురమున వసించియున్నప్పుడు రాజభాండారము నుండి ప్రతిదినము పనిసేవల గోక్షీరము నా యాశ్రమమునకు వచ్చుచుండెడిది" అనెను.

వెంటనే రాజు, "మంత్రీ! మన గోశాలనుండి శ్రేష్ఠములైన గోవులను మూటిని గొనివచ్చి సన్యాసిసేవ కాయత్తము చేయుము" అని యాజ్ఞాపించెను.

మంత్రి, "చిత్తము, మహారాజా!" అని పలికెను.

రాజు వ్యథాకలిత హృదయముతో అంతఃపురమునకు వెడలి పోయెను.

## 2

గొప్ప రాజసభ. కెంపులు పచ్చలు కూర్చిన జాలరులతో తళతళలాడు చాందిని, దాని క్రింద బంగారు జాలరులతో మెరయు ప్రశస్తమైన రాజచ్ఛత్రము, దాని క్రింద రత్నాలు పొదిగిన పసిడి సింహాసనము, సింహాసనమున రాజు కూరుచున్నాడు. ఆతని శిరమున కిరీటము, హస్తమున రాజదండము గలవు. నవరత్నఖచితమైన యా కిరీటము మీద కాంతి పడినంతనే నూదులవలె సన్నగను, మెరపుల వలె తీక్ష్ణముగను ప్రభలు బయలుదేరి దశదిశలు మిరుమిట్లు

కొలువుచుండెను. మిత్రులు, మాన్యులు, అమాత్యులు, సామంతులు, విదేశీయులు మొదలగు వారు రాజును పరివేష్టించి యుండిరి. సభాస్తంభముల అల వాకిలిమీది రత్నముల కాంతులతో సభాభవన మంతయు తళతళ మెరయుచుండెను. ద్వారములు పుష్పమాలలతోడను, మామిడి చివుళ్ల తోరణములతోడను శోభించుచుండెను.

సభలో నెచ్చటను కదలిక లేదు. శబ్దము లేదు. సభ్యులతో నిండి జీవకళలతో తేజరిల్లుచున్నను ఆ సభ చిత్రపటమందలి బొమ్మలవలె నిస్తబ్దముగా నుండెను. అట్టి సమయమున సభాభవనము ముంగలి గృహమునుండి మెల్లమెల్లగా టిక్ టిక్ అను శబ్దము వినవచ్చెను. తోడనే వైతాళికులు, మంగళ గీతికలు, జయగీతికలు పాడిరి. తరువాత రాజు గుణములు కీర్తించి, "జయము మహారాజునకు జయము" అని జయధ్వనులు కావించిరి. పిమ్మట సభాద్వారమునుండి యున్నత శిరస్కుడగు సన్యాసి ధీరగమనముతో సభలోనికి వచ్చెను. సభలో సంచలనము కలిగెను! రెప్పపాటులో రాజు సింహాసనము దిగి నిలుచుండెను. తోడనే మంత్రిసామంతాదు లందరు లేచి నిలువబడిరి. సన్యాసి ఆజానులంబితము లగు బాహువులెత్తి ఆశీర్వచనవాక్యములు పలికెను. రాజు సవినయముగా నెదురేగి, సాదరముగా గొనివచ్చి, సన్యాసిని సింహాసనమునకు దక్షిణముగా నున్నత పీఠమున గూర్చుండబెట్టి పిదప తాను సింహాసనమున గూర్చుండెను. పిమ్మట మంత్రి సామంతాదు లందరు, తమతమ స్థానముల గూర్చుండిరి.

అపుడు రాజు మంత్రివైపు తిరిగి, ‘‘మంత్రీ! రాజ్యము కుశలముగా నున్నదా?” అని ప్రశ్నించెను.

మంత్రి లేచి నిలుచుండి సవినయముగా, మహారాజా!”—అని యేదియో చెప్పబోవునంతలో, ‘‘సన్న్యాసి యతని మాట కడ్డువచ్చి యిట్లు పలికెను: “మహారాజా! కుశల మెట్లు కలుగును? ఎచ్చట దివారాత్రములు శూన్యమును పూజించుచున్నారో, ఎచ్చట క్రిందినుండి మీదికి అసత్యలీల-అసత్య క్రీడ జరుగుచున్నదో అచ్చట కుశల మెట్లుండును? విషయ వాసనల విజృంభణములో శాంతి యుండునా? ఇంద్రియకాంక్షల యగ్నిజ్వాలలలో చల్లదన ముండునా? విషవృక్ష మెప్పుడైన చందనతరువు కాగలదా? పంకములో వెదకిన రత్నములు లభింపగలవా? మహారాజా! కుశల మెంతమాత్రమును లేదు. ఈ యసత్యమును - ఈ మిథ్యను రూపుమాపిన గాని కుశలము కలుగదు.”

సభాసదు లందరు ఆశ్చర్యముతో రెప్ప వేయక, యూపిరి బిగబట్టి సన్న్యాసి వాక్యములు వినుచుండిరి. ఇత డెవరు? మనుష్యుడా, కాక, ఈశ్వరుడు మానవదేహముతో నిట్లవతరించెనా?

మంత్రి మాత్రము నెరసిన వెండ్రుక లల్లాడుచుండ, తొట్రుపాటున సన్న్యాసితో నిట్లనెను: “మహాత్మా! నేను వేదాంతిని కాను. ఏది నాకు ప్రత్యక్షముగా గనబడుచున్నదో అది కేవలము శూన్యమని భావింప లేకున్నాను. రాజ కార్యములు నిర్వర్తించుటలో తల నెరసి పోయినది. ప్రజల సుఖదుఃఖములతో నాకు బాగుగా పరిచయము కలదు

ఆ ధైర్యముతో, ఆ సాహసముతో రాజ్యక్షేమము విషయ
ములో నేను పలుకు పలుకు లక్ష్యముగా భావింప వలయు.''

తరువాత నతడు రాజు నుద్దేశించి కోసిలి మొగ్గి యిట్లు
విన్నవించెను: "మహారాజా! రాజ్య మంతయు కుశలముగా
నున్నది. రాజ్యములో అవసరమైన దానికన్న నెక్కువగా
పైరులు పెరుగుచున్నవి. సమస్త ధాన్యములు సమృద్ధిగా
పండుచున్నవి. ప్రజ లందరు కడుపునిండ సుఖముగా భోజ
నము చేయుచున్నారు. జీవనగుప్త మహారాజుల నామాక్షర
ములతో ప్రకాశించు జెండా లెత్తి వ్యాపారులు తమ యోడ
లతో సప్తసముద్రముల మీదను సంచరించి వ్యాపారములు
చేయుచున్నారు. శిల్పకారులు క్రొత్తక్రొత్త చిత్రములు
మనోహరముగా జీవకళలతో చిత్రించుచున్నారు. కవీం
ద్రులు రమణీయ కావ్యములు రచించుచున్నారు. విజ్ఞాన
వేత్తలు విమర్శించి విమర్శించి ప్రజల సుఖసంపదలు అభివృద్ధి
నొందుటకు తగిన పరికరములు సిద్ధము చేయుచున్నారు. శ్రౌత
స్మార్తక్రియలు, నిత్య నైమిత్తిక కర్మలు వర్ణాశ్రమాచార
విధుల ననుసరించి నిర్విఘ్నముగా సాగుచున్నవి. పూజలు,
ఉత్సవములు, జపములు, తపములు, మొదలగునవి నియ
మానుసారము చక్కగా నాచరించుచున్నారు. రాజకీయో
ద్యోగులు ధర్మదృష్టితో రాజగౌరవము కాపాడుచు, సేవా
ధర్మము పాటించుచు, ప్రజాహితము కోరి తమ విధులు
నిర్వర్తించుచున్నారు. రాజ్యమం దంతటను ధర్మము
నాలుగు పాదముల నడచుచున్నది. స్త్రీ పురుషు లందరు
ఆనందములో తేలియాడుచున్నారు. ఆ యానందముతో నే

వాయువులు మనోహరముగా వీచుచున్నవి. ఆ యానందము
తోనే కపోతములు సౌధశిఖరములందలి చల్లని నీడలలో
గూండ్లు కట్టుకొని ప్రతిపట్టణమందును, ప్రతి గ్రామమందును
మధుర గానములు చేయుచున్నవి. ఆ యానందముతోనే
వృక్షములు, లతలు, పుష్పములు నిర్భయముగా తల లెత్తి
విజృంభించుచున్నవి. ఆ యానందముతోనే నదులు చిత్రగతు
లతో ప్రవహించుచు తమ స్నేహరసముతో పృథివీ హృద
యమును సస్యశ్యామలము చేయుచు సముద్రునితో క్రీడింప
బోవుచున్నవి. మహారాజా! రాజ్యములో క్షేమము
తాండవించుచున్నది. జీవగుప్త మహారాజుల రాజ్యములో
సంవత్సరము పొడుగునను వసంతోత్సవము జరుగుచున్న
ట్లున్నది.

సన్న్యాసి విచారసూచకమగు స్వరముతో నిట్లు పలికెను:
"మహారాజా! మన చుట్టును వల పన్నుకొనుచున్నాము.
సాలెపురుగువలె మనము కోరికలను దారములతో స్వప్న
సదృశమైన వల పన్నుకొనుచున్నాము. ఆ వలమీద అవి
వేకమను కుంచెతో గాలివంటి రంగుతో ఆకాశపుష్పములు
చిత్రించుకొనుచున్నాము. దీని కంత మెప్పటికి, మహారాజా!
దీనికి పరిసమాప్తి యెక్కడ? అమృతములోనా? కాదు, విష
ములో! ఆనందములోనా? కాదు, ఆశాభంగములో! నవ్వు
లోనా? కాదు, కన్నీళ్ళలో! దీని తుది పరిణామము
మృత్యువు. మహారాజా! ఈ మాయను— ఈ పరమాణు
స్వరూపమును— ఈ శూన్యమును రూపు మాపవలెను. ఈ
మిథ్యను నాశము చేయవలెను. లేకున్న అమృతములభింపదు."

మంత్రి వినయముతో పల్కెను: "మహాత్మా! ఈ సంసారము స్వప్నసదృశమైన వల-కోరికల యల్లిక కావచ్చును. స్వప్నములో నున్నంతవరకు అందలి సమస్త కర్మములు, సమస్త వ్యాపారములు ఆచరింపవలసినవే. వానికి భంగము కలుగరాదు, కలిగినచో సృష్టికే లక్కే. సంసార స్వభావముననే భంగము వాటిల్లును. ఈ జగత్తు మిథ్య అని జ్ఞాను లన్నారు. మిథ్య అనగా నిర్వచింపరాని స్వభావము కలది అని చెప్పినారు. కాని అత్యంతము శూన్య మన లేదు. అది యట్లుండ నిండు. ఈ కోరికలకు-ఈ స్వప్నమునకు చివరి పరిణామము మృత్యువు కావచ్చును. అయినను ఎప్పుడో సంభవించు మృత్యువు నింత గొప్ప చేసి వివరించుట యెందులకు? నా కిప్పు డెనుబదియేండ్లు. కాలము సమీపించినపుడు మృత్యువు సంభవించును. మృత్యువున కావల నేమున్నది? అనంతమైన జీవనమా? కేవల శూన్యమా? అది యట్లుంచి ఎప్పుడో క్షణకాలములో సంభవించు మృత్యువుకోసము భయపడి నా యెనుబదేండ్ల జీవితము నెందులకు సంకోచము చేసికొనవలెను? అనంతమైన కాలముతో ఈ యెనుబది సంవత్సరము లెంత? ఈ కొంచెము కాలము నేను నాధర్మము నాచరించుచు నిర్భయముగా జీవించుటయే నాకు గౌరవము, నాకు శ్రేయము."

మంత్రి వాక్యములు పూర్తియై కాక పూర్వమే సన్యాసి యిట్లు పలికెను: "ఎవ రున్నారు, మంత్రీ! ఏమి యున్నది! ఈ యుండుట స్వప్నముతో చేసిన సూక్ష్మమైన వల! అది నీ కాంక్షా సూత్రములతో నల్లికొనిన మహోపద్రవము సుమా!

అది చరముగాని పరము గాని కాదు - అక్షయము గాని అవ్యయముగాని కాదు- అది అనశ్వరము కాదు- అది యీశ్వరుడు కాదు!"

ఇట్లు పలుకుచు సన్యాసి లేచి నిలుచుండెను. అతని నేత్రము లుత్సాహముతో తేజరిల్లెను. అతని ముఖమండలము దివ్యజ్యోతితో దీపించెను. అతడు దీర్ఘబాహువు లెత్తి మహోజ్జ్వలదృష్టితో రాజసభ కలయ జూచి, కంఠ మెత్తి, "చెప్పుడు ఒక్కసారి బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము అని చెప్పుడు" అని సింహనాదము చేసెను. ఆ నాదముతో సభాభవన మంతయు కంపించెను. ద్వారములందున్న కుసుమ మాలికలు వణకిపోయెను. రాచగొడుగునందలి బంగారు జాలరులు సంచలించెను. చాందినికి కట్టిన మణులు మకమకలాడెను. రాజకిరీట మధ్య మందున్న మరకతమణి మాత్రము మందహాసము చేసెను. సభాసదులు జ్యోతిర్మయ మగు సన్యాసి ముఖ మండలము నుండి చూడ్కులు మరలింపలేక పోయిరి. వార లందరు మంత్రముగ్ధుల వలె లేచి ఏకకంఠ్యముగ "బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము" అని పలికిరి.

సన్యాసి సింహాసనము వైపు తిరిగి, "మహారాజా! నేను తమ రాజ్యములో నా మతము ప్రచారము చేయగోరుచున్నాను. తమ ప్రజల నందరను సత్యమార్గమందు — అమృత పథమందు ప్రవేశ పెట్టెదను. అనుమతి దయచేయుడు" అని వచించెను.

రాజు మంత్రి కిట్లు ఆజ్ఞ యిచ్చెను: "మంత్రీ! శిప్రానదీ తీరమున సన్యాసికి గొప్ప మఠము నిర్మింపుము. రాజకోశము

నుండి సన్యాసికి పది వేల రూపాయలు దక్షిణగా నిప్పిం
పుము ”

శ్వేత కేశములు ప్రేలాడ శిరము వంచి మంత్రి,
“చిత్తము, మహారాజా!” అని పలికెను.

3

శిప్రానది మంథర గమనముతో ప్రవహించుచుండెను.
దిన మంతయు సూర్యకాంతిలో దాని హృదయము చకచక
లాడుచుండును. వెన్నెల రాత్రులందు దాని శరీరము కళకళ
లాడుచుండును. పగ లనక రాత్రి యనక కల గానము
చేయుచు, గలగల నాట్యము సలుపుచు నది ప్రవహించు
చుండును. రెండు జాము లప్పుడు అంతటను నిశ్శబ్దముగా
నున్న సమయమున తమాల వృక్షముల చిక్కని నీడలందు
సేదదేరి పావురములు కువు కువు ధ్వనులు చేయుచుండ శిప్రా
నది కుభయ పార్శ్వములందలి దేవదారు వృక్షములు తల
లెత్తి, “శిప్రా! నీవు పాటలు పాడుకొనుచు ఎచటికి వెళ్లు
చున్నావు!” అని యడుగు చుండును. అప్పుడు శిప్రాస్రవంతి
వాని కిట్లు ప్రత్యుత్తర మిచ్చుచుండును :

ఆ నీలి మబ్బులలో నా గభీరజలమ్ముల
లలవోక చలచలత్ శబ్దముల గులుకంగ
సాగర తరంగమ్ముల లాకాశహృదయమున
సరసంపు నాట్యములు సలుపునే దేశమున—

ఆ దేశమందుండి నా వీణె పాటతో
నరుగుచున్నా నమ్మ, అరుగుచున్నానే

నీలాల నింగిలో పాలు మబ్బులలోన
తేలిపో దూగుటుయ్యాలలో నూగుచును
తేనె పాటలలోన తీయందనా లూర
జ్ఞానైన కడలి యుప్పొంగ బవ్వళింపగా—
అరుగుచున్నా నమ్మ ఆనంద గతులతో
అల్లారు ముద్దుగా నరుగుచున్నానే!

శాంత నీలాకాశ శీతల స్పర్శచే
శ్రాంత గంభీర నీరము పులకరింపగా,
అమలానురాగ సల్లాప సంగతిలోన
ఆర్ద్రమై నా మనసు పరవశత నొందగా—
అరుగుచున్నా నమ్మ, యలస గమనమ్ముతో
అందాలు చిందంగ నరుగుచున్నానే!

విశ్వనాథుడు కరుణ వెలయగా నేర్పించు
విశ్వమోహనములౌ వివిధ గీతాళితో,
సృష్టిలీలా రహస్యములు కీర్తించుచును
సృష్టిసౌందర్యమున సొంపు సోనలు పరియ-
అరుగుచున్నా నమ్మ, యులరు పాటలతోడ
ఆనందలహరితో నరుగుచున్నానే!

అజ్ఞాన నిద్ర విడ ధర్మబుద్ధి జనింప
అపవర్గవాంఛ దీపింప నా గీతికల,

సంసార బద్ధులను సందేహ బుద్ధులను
సానందముగ మందహాసమ్ము సేయుమా—
అరుగుచున్నానమ్మ. హాయి పాటలతోడ
అల్లిబిల్లికనడల నరుగుచున్నానే!

నానవ్య మోహన సుగీతికల మేలుకొని
నవ్య జీవిత పదవి నానందకాంక్షతో,
హృదయాంతరాత్మ వికస్వాద్రిత శ్రీలతో
మృదువుగా నవ్యలీలా లాస్యములు సల్ప—
అరుగుచున్నా నమ్మ ఆనంద లయలతో
అలరారు సుడులతో నరుగు చున్నానే!

కలనాద గాన మూర్ఛనల శోభల కులికి
కటికి చీకటి పటాపంచలై పోవంగ,
అరుణ రవి కిరణముల యపరంజి పూతతో
తరుణ కుసుమాంగనలు తల లూపి నవ్వంగ—
అరుగుచున్నా నమ్మ, హంస యానమ్ముతో
అమృతమ్ము లూరగా నరుగుచున్నానే!

మేలుకొని బ్రతుకులో మేలుకొని నృత్తిలోన
మేళవింతును జగన్నాథు శ్రీచరణముల
మరల నాసంగీత లహరితో నరుదెంతు
సరసనాట్యము లాడ సాగరుని చరణముల—
అరుగుచున్నా నమ్మ నా వీణెపాటతో
అమల హృదయమ్ముతో నరుగు చున్నానే!

ఈ విధముగా శిప్రానది పాడుకొనుచు పోవుచుండెను. అనేక గ్రామములు చుట్టి చుట్టి అనేక పట్టణములు తిరిగి తిరిగి ఆడుచు, పాడుచు, ఊగుచు నూగుచు, నందివర్ధనము పూల వంటి నురుగులు గ్రక్కుచు గ్రక్కుచు, సుడులు తిరుగుచు తిరుగుచు, మొక్కవోని నడకతో జాలువారుచుండెను. తన జీవనములోని మార్దవమును, చల్లదనమును, అపారమైన స్నేహరసమును, భూమిపై వెదజల్లుచు, సాగరాభిసారికయై ప్రవహించుచుండెను. ఆ శిప్రానదీతీరమున రాజాజ్ఞ ననుసరించి సన్న్యాసి కొరకు గొప్ప మఠము నిర్మిత మయ్యెను.

వర్షాకాలము గతించెను. శరత్కాల నిర్మలకాంతి జగము నిండ వ్యాపించెను. సన్న్యాసి రాజపురి వదలి మఠములో ప్రవేశించుటకు రాజమార్గమున బయలుదేరెను. రాజపథమున జనులు క్రిక్కిరిసి యుండిరి. త్రోవ కిరువైపుల నున్న వేల కొలది దుకాణములలో క్రయవిక్రయములు అపరిమితముగా జరుగుచుండెను. సన్న్యాసిని చూచినంతనే క్రేతలును విక్రేతలును క్రయ విక్రయముల మాట మరచిపోయిరి. గృహములందలి కులాంగనలు కిటికీలు తెరచి నిర్నిమేష నయనములతో సన్న్యాసిని చూడ దొడగిరి. కన్యలు కొందరు తమ కిట్టి భర్త దొరకిన బాగుగా నుండు ననుకొనిరి. వృద్ధ స్త్రీలు తమ కిట్టి కుమారు డుండిన బాగుగ నుండు ననుకొనిరి. సన్న్యాసి ఏవైపును చూడకుండ ముక్కుకు సూటిగా వెడలిపోవుచుండెను. ఇత డెవ్వ డని జను లొకరి నొకరు ప్రశ్నించు చుండిరి. కొందరు, “మహాదేవుడు రాజునకు స్వప్నమున ప్రత్యక్షమై శీఘ్రకాలములో మానవదేహము ధరించి నీ నగరమునకు

వచ్చునని వర మిచ్చినాడట! ఆ మహాదేవుడే ఈ సన్యాసి" అని పలుకుచుండిరి.

సన్యాసిమఠము వద్దకు చేరెనో లేదో అచటి ప్రదేశ మంతయు జనారణ్యమై పోయెను. నాటి దివసము పూర్తి యయ్యెనో లేదో అతనికి లక్షమంది శిష్యు లయిరి. మఠ శిఖరమున కాషాయ పతాకము దర్పముతో నెగురుచుండెను. ఆ జెండా గాలికి నటు నిటు కొట్టుకొనుచు, జగత్తు శూన్యము జగత్తు శూన్యము అని ధ్వనించు చున్నట్లుండెను.

సస్యములు పాడుచేయు మిడుతల దండువలె నా సన్యాసి శిష్యు లందరు మతప్రచారము కొరకు శాకద్వీపము నాలుగు దిక్కులకు వెళ్లిరి. ధనికుల మేడలందును, సామాన్య గృహస్థుల గృహములందును, దరిద్రుల కుటీరములందును, బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము, అను వాక్యములు ప్రతిధ్వనించెను. పట్టణములలోని కోలాహల మందును, పల్లెలలోని నిశ్శబ్దత యందును, ఉద్యానములలోని చల్లని నీడల యందును 'బ్రహ్మ సత్యము జగత్తు శూన్యము' అను ధ్వనియే వినబడుచుండెను. శాక ద్వీప మామూ లాగ్రము కావి రంగులో మునిగి నట్లును, అంతరిక్షము కాషాయ రేణువులతో నిండినట్లును తోచెను. మందమారుత ములు సైతము కాషాయగంధముతో వీచుచున్న ట్లుండెను. ఆకాశమునుండి బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము అను సంగీతము వినవచ్చు చున్న ట్లుండెను. ఎచట వినినను, 'ఓయీ! ఇంక నే మున్నది? ఏమియును లేదు, నీవు లేవు, ఈ జగత్తును లేదు. అప్పు డీ పనులు, ఈ పరిశ్రమలు, ఈ భోగ

ములు ఎవరి కోసము? ఓయీ! మూర్ఖుడా! నీవు మంగళము కావలయు నేని అన్నియు కట్టిపెట్టుము!' అను వలువలే!

ఈ రీతిగా దినములు కడచినవి, మాసములు కడచినవి. సంవత్సరము కడచినది, కొన్ని సంవత్సరములు కడచినవి. క్రమక్రమముగా స్త్రీపురుషుల శరీర సంధి బంధములు సడలి పోయినవి. వారి జీవనామృతములోని మాధుర్య మింకిపోయి నది. సృష్టిలోని శబ్ద స్పర్శ రూప రస గంధము లర్థ హీనము లైనవి. శ్రీమంతుల భోగసామర్థ్యము చివికిపోయి నది. సామాన్యుల కర్మ సామర్థ్యము సడలి పోయినది. వణి జులవాణిజ్య శాలలు సర్వస్వాతంత్రము లైనవి. కృషికుల నాగళ్ళ మేడిపల్లు పట్లు తప్పినవి. ఎవరినోట విన్నను జగత్తు శూన్యము —జగత్తు శూన్యము అను మాటలే! ధనవంతుల సౌధముల మీద మేఘములు లేకుండ పిడుగులు పడినవి. వ్యాపారుల వ్యాపారనౌకలు తుపాను లేకుండ మునిగిపోయి నవి. గృహస్థుల గృహములు అగ్ని లేకుండ మండిపోయినవి. కృషీవలుల పొలములు ఎండలు లేకుండ బీటలు వారినవి. పశువులకొట్టములందు పశువు లకారణముగ మరణించినవి. ప్రజల నిస్పృహతో సమస్తము వ్యర్థమై పోయినది.

మంత్రి రాజువద్దకు వెళ్ళి "మహారాజా! రాజ్యమునకు అమంగళము వాటిల్లినది. దుర్భిక్ష మాసన్నమైనది" అని విన్నవించెను.

రాజు సంభ్రమాశ్చర్యములతో నిట్లనెను: "దుర్భిక్ష మాసన్న మైనదా, మంత్రీ! ఏమంటివి దుర్భిక్షమా! నా

రాజ్యములో ప్రతి సంవత్సరము మూడేండ్లకు సరిపోవు
పంటలు పండుచుండెడి. నా రాజ్యములో—హా మహామంత్రి!
నీకు మతిపోయినట్లున్నది. నీవు పదవినుండి విశ్రమింప వలసిన
యవసరము సమీపించిన ట్లున్నది.”

మంత్రి దుఃఖ సూచకముగా మందహాసము చేసి యిట్లు
విన్నవించెను: “మహారాజా! నాకు మతిపోలేదు. రాజసన్ని
ధిలో నేను సత్యవార్తలనే నివేదించు చున్నాను. రాజ్య
ములో యథార్థముగా కరవు కావిరి కమ్ముకొను చున్నది.
స్త్రీ పురుషు లందరు జీవితాసక్తి కోలుపోయినారు—జీవితా
నందము పూర్తిగా విస్మరించినారు. సేద్యగాండ్రు వెనుకటి
యుత్సాహముతో పొలములు దున్నుట లేదు. వారి నాగళ్ళ
మేడిపట్లు జారిపోవు చున్నవి. జననియగు భూదేవిని వారు
వెనుకటి వలె చూచుట లేదు. అందుచేత నా దేవి నిర్జీవమై
సారము కోలుపోయినది. ఆ తల్లి నట్లు లవమానించుటచే
తత్ఫలముగా కృషికులకు పదియవవంతు పంటలు గూడ లభిం
చుట లేదు. వాణిజ్యము సన్నగిల్లినది. శిల్పము శిథిలమైనది.
ఆ వణిజుల దృష్టిలో ఆ శిల్పుల తలపులో ఈ జగము కారా
గారమైనది— అసౌఖ్యస్థానముగా అమంగళ ప్రదేశముగా
పరిణమించినది. వారి నావలు నేడు కొయ్యల పోగులుగా
మారినవి. నావికుల మనస్సు అపమార్గము పట్టినది. వారి
యానంద మంతరించినది. వారి జీవితాశ చెదరినది. ఆ వర్త
కుల సంతోష ధ్వనులతో, హృదయోత్సాహములతో సప్త
సాగరముల తరంగములు కల కల ఛల ఛల మని ధ్వనిం

చుట లేదు. ఆ వీచికలు పెద్ద పెట్టున లేచి వికటాట్టహాసములు చేయుచున్నవి. తుపాను లక్ష్యర లేకయే వర్తక నౌకలను ముంచి వేయుచున్నవి. ప్రజలందరు శుష్క వేదాంతులై సూర్యకాంతి నిరాకరించి, అమావాస్యాంధకారములో ప్రాకులాడుచు స్వర్గజ్యోతిని వికసింపజేయుటకు వ్యర్థ ప్రయత్నములు చేయుచున్నారు. మహారాజా—"

రాజు విచలితుడై మంత్రిమాటలు పూర్తి కాక ముందే, "మంత్రీ నేను రాజ్య మంతయు పరిశీలింప గోరుచున్నాను. అందుకేర్పాటు చేయింపుము" అని యాజ్ఞాపించెను.

రాజును మంత్రియు మారు వేసములు వేసికొని రహస్య ద్వారము నుండి బయలు వెడలి రాజమార్గమున తిరుగ జొచ్చిరి. రాజ వీధికి రెండు వైపుల పెద్దపెద్ద మేడలు కలవు. వీధిలో కొద్ది మంది మాత్రమే వచ్చుచు పోవుచుండిరి. రాజ వీధిలో వెనుకటి కళ లేదు. వెనుకటి శ్రీ లేదు. సౌధములలో నుండి సన్నని రోదనధ్వని బయలు వెడలి ఆకాశములో కలసిపోవుచున్న ట్లుండెను. మేడలలోని స్త్రీపురుషుల ముఖమండలము లుత్సాహముతో ప్రకాశించుట లేదు. వారి నేత్రములు మెరపుమెరుగులతో మెరయుట లేదు. విపరీతమైన విరాగముతో వారు తమ నిర్జీవ శరీరములను కంపతొడుగులవలె ఈడ్చుకొనుచు, ఈ శరీర భారము ఎప్పుడు వదలిపోవునా యని విచారించుచున్న ట్లున్నారు. దుకాణములందు క్రయ విక్రయముల వ్యాపారము కొంచెముగా జరుగుచుండెను. కాని యా వ్యాపారము యంత్రపు మనుష్యులు యంత్ర సాహాయ్యముతో కాలు సేతులు కదలించుచున్న ట్లుండెను.

ఎటు చూచినను మృత్యుచ్ఛాయలు భయంకరముగా నావ
రించు చుండెను. ఆ పెద్ద పెద్ద మేడలలో జనులు శూన్య
దేశపు మమ్మీల వలె నివసించు చుండిరి. ఆ గొప్ప దుకా
ణము లందు పిశాచములు కూర్చుండి బేరము చేయుచున్న
ట్లుండెను. బయట నుండియే కాదిట్లు కనవచ్చుట! లోపల
కూడ—గృహములలోపల—దుకాణములలోపల - మనుష్యుల
లోపల విద్యుత్తులు లేవు. ఏ విద్యుత్తుల స్పర్శచే జీవిత మం
తయు సుందరమై సార్థకమై, సంపూర్ణమై శోభించుచుం
డెడిదో ఆ విద్యుత్ప్రకాశము లేదు. రాజు ఈ వైపరీత్యమును
పరికించెను. అతని కన్నుల నీరు గ్రమ్మెను. అంత నతడు
రాజధాని వదలి, జనపదములు ప్రవేశించెను.

పల్లెలలో కన్నులపండువుగా నుండు పూర్వకళ లేదు.
చెట్లపై ఆకుల గుబురులు లేవు. ఆకులు పండిరాలి పలుచనై
జీవ కొమ్మలు బయటపడి యా వృక్షము లస్థిపంజరముల
వలె, మూఢ విశ్వాసముచే కృశించిన మూర్ఖులవలె కనబడు
చుండెను. క్షేత్రములందు మైమరపు కలిగించు నాటి శ్యామల
శోభావిలాసములు లేవు. తటాకములం దన్యోన్యము మెడలు
కీలించుకొని హంసలు విహరించుట లేదు. బజారులందు పిల్లల
నవ్వు కేరింతలు వినబడుట లేదు. రెండు జాముల వేళ చల్లని
మఱ్ఱినీడల గూర్చుండి గొల్లపిల్లవాండ్రు పిల్లనగ్రోవుల
నూదుట లేదు. దేవాలయములందు గంటల చప్పుడులతో
ఆరతులు వెలుగుట లేదు. వెన్నెల రాత్రులందు పిల్లలు తల్లుల
వద్ద కూర్చుండి కథలు వినుచు ఊకొట్టుట లేదు. ఆ సుఖము.
ఆ సంతోషము, ఆ సంపద అన్నియు ఐంద్రజాలికుని మంత్ర-

ప్రభావముచే మాయమై పోయినట్లు అదృశ్యములై పోయి
నవి. ఎండిన పచ్చిక బయళ్ళలో నెచ్చటనైన కొంచెము
మేత దొరకునేమో అని కన్నులలో ప్రాణములు పెట్టుకొని
గోవులు గేదెలు మొదలైన పశువులు తిరుగులాడు చుండెను.
పల్లెల ప్రక్కల వంకలు వంకలు తిరిగి ప్రవహించు నదులు
సన్నగిలిపోయి దీనురాండ్రగు బిచ్చగత్తెలవలె ప్రాణము
లరచేత పెట్టుకొని కుమిలి కుమిలి యేడ్చుచు జాలువారు
చుండెను. ఎచ్చటికి పోయినను ఎచట విన్నను "బ్రహ్మ
సత్యము, జగత్తు శూన్యము! ఓరీ, పామరుడా, ఏమి ప్రయో
జనమురా తుచ్ఛమై యీ మాయాజాలములో తగు
ల్కొనుట ఏలన! ఏదో విధముగా నీ రెండు దినములు
కనులు మూసికొన్నచో కాలము వెళ్ళిపోవును గదా! అదే
శ్రేయస్కరము!" అను వాక్యములే! రాజు అంతయు పరీక్షి
లించెను. అంతయు వినెను. విని యతడు, "మంత్రీ! ఈ
పరివర్తనమునకు కారణ మేమి?" అని అడిగెను.

మంత్రి యిట్లు విన్నవించెను: "మహారాజా! వేరు
కారణ మేమున్నది? సన్యాసి చేసిన శుష్కవేదాంత ప్రచా
రమే యీ దౌర్భాగ్యమునకు హేతువు! ధర్మవిధులు నిరుప
యోగము లనియు, కర్మలు వ్యాపారములు నిష్ప్రయోజ
నము లనియు, ఈ జగమున కస్తిత్వమే లేదనియు, శాస్త్ర
ములు గాని, శాస్త్రానుభవము గల మహనీయులు గాని
యెప్పుడును చెప్పియుండ లేదు. సృష్టిస్వభావమునకును, జ్ఞాన
సంపన్నుల యనుభవమునకును విరుద్ధమైన యీ విపరీత
సిద్ధాంత ప్రచారమువల్ల జనులు జీవితప్రయోజనమును, జీవి

తోత్సాహమును కోలుపోయినారు. యుగ యుగముల నుండి ఐహికాముష్మిక సుఖములకును, నిశ్రేయసమునకును మూలముగా నున్న ధర్మ నియమముల నుల్లంఘించి అధోగతి నొందినారు. మా దేవిని తిరస్కరించి నిరర్థకులై నష్టప్రులైనారు. అందుచే ప్రకృతిజనని కూడ నిక్షీణమై ఆనందరహితమైనది. ఇహలోకదుఃఖము పరలోక సుఖమునకు కారణమగునట, ఇహలోకమందలి యసమర్థత పరలోకమందలి సమర్థతకు మూలమగునట! ఇహలోకమందలి నరకానుభవము పరలోకమందలి పరమసుఖమునకాస్పదమగునట! ఇదియే వారిప్పుడు నేర్చుకొనిన సిద్ధాంతము. ఇదియే సత్యమైన, అతిసహజమైన మార్గమట! అందుకు ఫలితముగా వారి కిపుడు మృత్యువు లభింపనున్నది."

రాజు దుఃఖభారముతో రాజధానికి తిరిగిపోయెను. క్రమక్రమముగా దేశ మంతటను దుర్భిక్ష మలముకొనెను. అన్నవస్త్రములకు మూల్యము మండిపోజొచ్చెను. ఇదివరకు రూప్యమున కెనిమిది మణుగులు దొరకు బియ్యము ఇప్పుడెనిమిది రూప్యములకు మణుగు కూడ లభించుట లేదు. నాడు రెండు రూప్యములకు వచ్చు వస్త్రములు నేడు ఇరువది రూప్యములకు గూడ లభ్యమగుట లేదు. ఎటు చూచినను జనులు హతాశులై హాహాకారములు చేయుచుండిరి. కొంద రొక్కపూట మాత్రము భుజించుచుండిరి. కొందరు సగము భోజనముతోడనే ప్రాణములు నిలబెట్టుకొనుచుండిరి. కొందరా మాత్రము కూడ లేక మలమల మాడిపోవుచుండిరి. ఆ బాధ ననుభవించుటకు గూడ వారికి

ప్రాణ లేదు. జనులు పూర్తిగా నిస్సత్త్వులైపోయిరి. అయి నను అందరును గలసి ఈ ప్రపంచస్వభావ మిట్టిదే సుమా అనుకొనుచుండిరి. అట్టు లనుకొని వంతనే వారి కంఠముల నుండి ద్విగుణీతోత్సాహముతో, "బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము. ఈశూన్యత నుండి యెంత శీఘ్రముగా విముక్తుల మైన నంత శ్రేయము" అను వాక్యములు బయలు వెడలు చుండెను. ప్రతి గృహమునను కావిరంగు వస్త్రము లెక్కు వగా వెలయ సాగెను.

4

జంబూద్వీపరాజు సింహాసన మధిష్ఠించి యుండగా గుప్త చారుడు వచ్చి శాకద్వీపము దురవస్థ పాలైన దని నివేదిం చెను. వెంటనే హూణేశ్వరుడు సంతోషముతో సింహాసన మునుండి క్రింది కొక్క దూకు దూకి, "ఏమంటివి, ఏమంటివి? శాకద్వీపమున కెట్టి యవస్థ పట్టినది?" అని కేకలు వేసెను.

జంబూద్వీపరాజు హూణేశ్వరుడు. అతని తండ్రి మాఘు లేశ్వరుడు, అతని తండ్రి బాణేశ్వరుడు, అతని తండ్రి చండే శ్వరుడు. ఏడు పురుషాంతరముల నుండి వారు శాకద్వీపము జయించుటకు ప్రయత్నములు చేయుచుండిరి. కాని యెప్పటి కప్పుడా రాజులు పరాభూతు లగుచుండిరి. నేడు శాకద్వీప మున కిట్టి దుర్దశ వాటిల్లిన దని విన్నంతనే హూణేశ్వరుడు మహోత్సాహముతో, "సేనాపతీ! సైన్యము నాయత్తము చేయుము, శాకద్వీపము మీదికి దండయాత్ర సాగింపుము" అని సేనాపతి కాజ్ఞ యిచ్చెను. తూర్యములు భేరులు

మ్రోగినవి. ఖడ్గములు ఝణఝణాత్కారములు చేసినవి. బల్లెములు తళతళ మెరసినవి. పదునైదువేల సైనికులు, పదివేల గజములు, ఇరువదివేల యశ్వములు వెంట దీసికొని సేనాపతియును శాకద్వీపము మీదికి దండు వెడలెను.

అతను చతురంగబలాలతో పేరుపై వచ్చుచున్నాడని వేగువా గుప్త మహారాజునకు తెలిపెను. అప్పుడతను మంత్రిని పిలిపించి, "మంత్రీ! మన రాజ్యములోని ప్రతి పట్టణమందును, ప్రతి గ్రామమందును చాటింపు వేయింపుము: జంబూద్వీపరాజు శాకద్వీపమునకు చిరకాల శత్రువు. అతడిప్పుడు గొప్ప సైన్యము వెంటగొని మన దేశము మీదికి మరల దండయాత్ర వచ్చుచున్నాడు. స్వదేశరక్షణార్థము మరల శస్త్రములు ధరింపవలెను. దేశములోని సమర్థులగు యువకులందరు వెంటనే బయలుదేరి రండు. జంబూరాజును పరాజయ సత్కారముతో మరల పంపివేయుదము అని [illegible] పంపుము" అని యానతిచ్చెను.

రాజానుచరులు రాజాజ్ఞతో దేశస్వాతంత్ర్యరక్షణార్థము దేశములోని యువకులను సాహ్వానించుటకై నలుదెసలకు బయలువెడలిరి. ప్రతి నగరమునకును, ప్రతి గ్రామమునకును బోయి వారు రాజాజ్ఞ నెఱిగించిరి. తరువాత నొక్కరొక్కరు వెళ్లినట్లు రాజధానికి తిరిగివచ్చిరి. వారితో గూడ జను లెవ్వరును రాలేదు.

సేనాపతి స్వయముగా బయలుదేరి వెళ్లి, ఆయా ప్రదేశములందుండువారి కిట్లు చెప్పెను: "శాకద్వీపవాసులారా! మన స్వాతంత్ర్యము హరించుటకు శత్రువు వచ్చుచున్నాడు.

మేలుకొనుడు! నడుములు కట్టుడు! మీ బాహువులందు బల
మున్నంతవరకు, మీ నాడులందు రక్తము ప్రవహించు
చున్నంతవరకు స్వదేశరక్షణార్థము - దాస్యముఖమునుండి
స్వాతంత్ర్యము రక్షించుకొనుటకు బయలుదేరి రండు! పల్లె
లలోని కుటీరములనుండి, పట్టణములలోని సౌధములనుండి,
అనివార్యమైన వీర్యముతో, అజేయమైన బలముతో, అరి
భయంకరమైన పరాక్రమముతో బయలుదేరి రండు!"

సేనాపతివాక్యము లెవ్వరి హృదయములందును సంచల
నము కలిగింప లేదు. అవి యాకసములో లీనమైపోయినవి.
నిరాశా పూరిత హృదయుడై సేనాపతి యొక్కడే చివరకు
రాజధానికి తిరిగి వెళ్ళెను.

అంతట రాజు స్వయముగా బయలుదేరి ప్రజలనిట్లు
ఆహ్వానింప నారంభించెను: "శాకద్వీపవీరులారా! రండు,
రండు. మన పితృపితామహాదు లందరు నిదివరకేవిధముగా
జంబూద్వీపరాజులను మాటిమాటికి పరాభూతులను జేసి
ససైన్యముగా పారద్రోలి మన ద్వీపప్రాంతములవంక గూడ
తిరిగి చూడకుండ నున్మూలించిరో, ఆ విధముగా మనము
గూడ ఈ హూణేశ్వరుని, ఇతని యపార సైన్యమును రూపు
మాపవలెను. పరధన పరరాజ్యములపై దురాశగల హూణే
శ్వరుని వీనులందు మన ఖడ్గముల ఖడఖడాత్కారములు
మ్రోగవలెను. అతని నేత్రములకు మన బల్లెముల తళతళలు
మిరుమిట్లు గొలుపవలెను. అతని దుస్సాహసమునకు మన
శాకద్వీప తేజోవీర్యములు పరీక్ష నీయవలెను. మన కత్తుల
చురుకును మన బల్లెముల వాడియు మన శకజాతి కీర్తిని

వెలయించుగాక! వీరులారా! ఐక్యముగా శౌర్యోత్సాహ ముతో బయలుదేరి రండు! ఆ సింహళుడు! ఇక వ్యవధి లేదు. శత్రువు మన ద్వారము వద్దకు వచ్చుచున్నాడు. సత్వరము రండు! మన శకజాతి చిరకాలప్రతిష్ఠ నిలుపబెట్టుడు!"

రాజు నాదేశము ప్రజలను చీమ కుట్టినంత మాత్రము కూడ చలనము కలిగింపలేదు. ఎవ్వరును తిరిగియైన జూడ లేదు. రాజు మహాదుఃఖముతో రాజధానికి తిరిగి పోయెను.

హూణేశ్వరుని జయధ్వని సమీపమునుండి వినవచ్చెను. శాకద్వీపములో కొన్ని ప్రదేశములందు మృదుస్వరముతో డను, కొన్ని తావుల హీనస్వరముతోడను, "బ్రహ్మ సత్యము, జగత్తు శూన్యము" అను ధ్వని మాత్రము జనులు వెడలుచుండెను. హూణేశ్వరుడు త్వరితగతితో స్వచ్ఛంద ముగా శాకద్వీపరాజధాని లోనికి వెళ్ళెను. ఎచ్చటను ఒక్క కత్తి కూడ ఎదురొడ్డ లేదు. ఒక్క బల్లెము కూడ ఎదురింప లేదు.

జీవనగుప్తుడు మొగముమీద కొట్టుకొనుచు సింహాసనము మీద చదికిలబడి, "ఏమి చేయుదును, మంత్రీ! ఏమి చేయు దును! తన స్వాతంత్ర్యము రక్షించుకొనుటకొక్కడు కూడ బయటికి రాడాయెనే! ఇక దేశము నెవరు రక్షింతురు? జనులు లేరు! కుబేరుని కన్నను కోశమునందు ధనము రాసులు రాసులుగా నున్నది అయిన నేమి ప్రయోజనము! జనులు లేరు గదా! శస్త్రాగారము నిండ కావలసిన వానికన్న నెక్కువగా శస్త్రములు సిద్ధముగా నున్నవి. కాని, ఏమి

లాభము? వాని నుపయోగించుటకు జనులు లేరు గదా! లక్షసైన్యమునకు సంవత్సరము పొడవున సరిపోవు నాహార పదార్థములు ఆయత్తములై యున్నవి. అయినను ఏమి ఫలము! జనులు రాకపోయిరి గదా! ఈ సన్యాసి యమధర్మ రాజు వలె మన కెక్కడ దాపురించినాడు! ఈ శుష్కవేదాంతము మనల నామూలాగ్రముగ ధ్వంసము చేసినది!” అని విలపింప నారంభించెను. నిరాశచే, సంక్షోభముచే నతని నేత్రములనుండి యశ్రువు లురలనాగెను.

హూణేశ్వరు డస్తమానము కాక పూర్వమే రాజధానిలో ప్రవేశించెను. ప్రతి గృహమందును ద్వారములు గవాక్షములు మూసియుండెను. రాజమార్గమున నెచ్చటను దీపములు వెలుగుట లేదు. ఎక్కడను ఒక్క మనుష్యుడును గూడ కదల లేదు. ఎక్కడ చూచినను మృత్యు నిస్తబ్ధత ప్రబలియుండెను. ప్రేతలోకమును వలె భీభత్సత తాండవించుచుండెను. క్రమక్రమముగా నంధకారము గభీరమై గభీరతరమగుచుండెను. హూణేశ్వరుడు తన యేబదివేల సైన్యముతోడను, ఇరువదివేల యశ్వములతోడను, పదివేల గజములతోడను వచ్చి రాజధాని యుత్తరద్వారము నాక్రమించెను. ఆ సమయమున కన్ను పొడుచుకొన్నను కాన రాని కటికచీకటిలో జీవనగుప్త మహారాజు తన యేడుగురు రాణులను వెంట దీసికొని రాచనగరు వదలి దక్షిణద్వారము నుండ వెడలిపోయెను.

౫

హూణేశ్వరుడు జీవనగుప్తుని సింహాసన మధిష్ఠించెను. అతడు చారుని పిలిచి, "గుప్తచరా! ప్రబల ప్రతాపాన్విత మైనది గదా ఈ శకజాతి! మాపూర్వు లెన్ని పర్యాయ ములో జయింప ప్రయత్నించి విఫలమనోరథు లైరే! అట్టి శకజాతి నే డిట్టి దుర్దశ నొందుటకు కారణ మేమి?" అని యడిగెను.

అపుడు గుప్తచారు డిట్లు విన్నవించెను: "మహారాజా! నేటికి పది సంవత్సరముల నుండి యీ శాక ద్వీపమున సన్యాసి నివసించు చున్నాడు. అత డతి సూక్ష్మ దృష్టితో కనిపెట్టినా డట ఈ జగత్తున కస్తిత్వమే లే దని! బ్రహ్మ మొక్కటే సత్య మనియు, జగత్తు శూన్య మనియు, అందు చేత జాతిమతవిభేదము లనవసరము లనియు, ధర్మకర్మలు నిరర్థకము లనియు, ఆర్థికోద్యోగవ్యాపారములు నిష్ప్రయోజ నము లనియు అల్పమైన జీవితకాలములో భోగములకొరకు శ్రమించుట వ్యర్థ మనియు, యోగ్యతాయోగ్యతలతో నవసరము లేకుండ, విధినియమములతో నిమిత్తము లేకుండ నందరు అమరమార్గ ప్రవిష్టులు కావలె ననియు అతడు బోధించినాడు. ఈ శాకద్వీప మంతటను తన మతము ప్రచారము చేసినాడు. ఇట్టి విపరీతసిద్ధాంతముల నవలంబించి శాకద్వీపవాసు లందరు తేజోవిహీనులై, ఆనంద రహితులై నిర్వీర్యులై పోయినారు. ఆ శుష్కవేదాంతమునకు ఫలిత ముగా శకజాతికి నే డిట్టి దుర్దశ సంప్రాప్తమైనది!"

"ఇప్పుడా సన్యాసి యెచట నున్నాడు?"

"అత డిప్పటికిని శిప్రానదీతీర మందలి మఠములో నున్నాడు."

"ఆ సన్యాసిని నా సన్నిధికి తీసికొని రమ్ము."

సన్యాసి హూణేశ్వరుని సన్నిధికి వచ్చెను. హూణేశ్వరుడు తన మెడలో నుండి బహుమూల్యమగు మణిహారమును దీసి సన్యాసి కంఠమందు వేసి, "మహాత్మా! మా పితృపితామహాదులు సప్తపురుషాంతరముల నుండి శస్త్రములతో నిర్వర్తింపలేని ఘనకార్యము తా మొక్కరు తమ వేదాంతప్రచారముచే సుసంపన్నము చేసినారు. అందులకీ సమ్రాట్టు హూణేశ్వరుడర్పించు నీ యల్ప పారితోషికము గ్రహించు పిసని కృతార్థుని జేయుడు!" అని విన్నవించెను.

తరువాత సమ్రాట్టు సేనాపతిని పిలిచి, "సేనాపతీ! సత్వర మీ సన్యాసిని మన సామ్రాజ్యసీమనుండి యావలకు పంపు నేర్పాటు చేయుము. అందుకోస మొక్క నెల గడు విచ్చుచున్నాను ఈ లోపల నిత డెట్టి మత ప్రచారమును చేయరాదు. నెలరోజులు దాటిన తరువాత నాసామ్రాజ్యపు సరిహద్దులలో నగపడినచో ప్రాణదండనము విధింపబడునని సన్యాసి తెలిసికొనును గాక!" అని యాజ్ఞాపించెను.

సేనాపతి వినయ సూచకముగా కోశము నుండి ఖడ్గము బయటికి దిసి శిరము వంచి, "చిత్తము మహారాజా!" అని పలికినాడు.

స మా ప్త ము